# ఆంధ్రమహిళ


సంపుటి 15 :: నవంబరు 59' :: సంచిక 11

**వ్యవస్థాపకురాలు :**
శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్



**సంపాదకురాలు :**
శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర.


## విషయసూచిక



### 1959 ఆగష్టులో హిందీ పరీక్షలకు వెళ్లినవారు

ప్రాథమిక :

కే. దుర్గాభవాని, II. క్లాసులో

మధ్యమా :

ప్రత్తిఅనసూయ II. క్లాసులో

ఉత్తీర్ణులైనారు.

# దీపకాంత

చేయినెత్తి చాటుకొంది
సత్యభామ నిత్యకీర్తి !
కతారుడు రక్కసునొక్కని
కూలదోసిన లలనామణి !

హర్ష ధ్వానాలువర్షించి
ప్రహ్లాదము ప్రసరించి
సకల చరా చరాలన్ని
సాగించెను దీపావళి

మూడుకోట్ల దేవతలకు
మూడుకోట్ల యాంధ్రులకు
దివికి భువికి దివ్యామై
దీపావళి ! దీపావళి !

మానవాళి గుండెలందు
దీపావళి పర్వమందు
తెలుగుజాతి తీర్చుకొంది
తేజరిల్లు దీపకాంతి

వీనులవిందుగా హృదయ
వీణలుమీటిరి యాంధ్రులు
దీపావళి వెలుగుబాట
తెలుగుతోట తేటిపాట!

మింటిలోని పాలపుంత
మంటిపైని దీపకాంత
కల్పవల్లి ! పాలవెల్లి !
కవితావల్లి ! దీపావళి !

---

శ్రీమతి ఆలా సరోజినీదేవి




సంపుటి 15 :: నవంబరు 59' :: సంచిక 11

# మహిళలకు విద్యావకాశాలు

స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత మహిళాభ్యుదయానికై జరుగుతున్న సర్వతోముఖ కృషికి యితోధికంగా సంఘ సంస్కరణాభిలాషు లందరూ చేయూత నిస్తూనే వున్నారు. సాధించిన కృషికూడా చాలావరకు ఫలవంతంగా సాగుతూంది. నేషనల్ కౌన్సిల్ ఫర్ విమెన్సు ఎడ్యుకేషనల్‌ను వేసి వారి పరిశీలనలను జాగ్రత్తగా పరిశీలించి కేంద్రప్రభుత్వం "నేషనల్ కౌన్సిల్ ఫార్ విమెన్సు ఎడ్యుకేషన్" నెలకొల్పడంతో మహిళా విద్యా విషయాలు ఒక కొలికికి తెచ్చినట్టయింది. ఇకపై మహిళల విద్యాభివృద్ధి పథకాలన్నీ యీ కౌన్సిల్ ఆధ్వర్యంక్రింద నడుస్తాయి.

ఇరవై ఐదుగురు సభ్యులతో భారత ప్రభుత్వం యీ కౌన్సిల్ నెలకొల్పింది. భారత ప్రభుత్వానికి బాలికల స్కూలు విద్యకు సంబంధించిన విషయాలను గురించీ సలహాలను యిస్తారు. ఈ కౌన్సిల్ అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్.

చైర్మన్‌కాక, రాష్ట్ర ప్రభుత్వాల తరపున పధ్నాలుగురు సభ్యులు, కేంద్ర విద్యా సలహా సంఘం, పార్లమెంటు ప్లానింగు కమీషను, లేబరుశాఖ, మొదలైన వివిధ ప్రభుత్వశాఖల ప్రతినిధులు కూడ యీ సంఘ సభ్యులుగా వుంటారు. యీ సంఘంలో దేశం మొత్తం మీద ప్రముఖ విద్యావేత్తలూ, విద్యాధికారులూ సభ్యులుగా నున్నారు. సంవత్సరానికి కనీసం ఒకసారి యీ సంఘం సమావేశం అవుతుంది. ఢిల్లీలో వీరి కార్యాలయం వుంటుంది.

ఈ కౌన్సిలు, స్కూలుకువెళ్ళే వయస్సు బాలికల విద్యా సౌకర్యాలను గురించిన ప్రణాళికలు, కార్యక్రమాలు అవసర విషయాలను గురించి సలహాలనిచ్చి విద్యా వ్యాప్తికి కృషి చేస్తుంది. స్వచ్ఛంద సంస్థల సహాయంతో దేశంలో మహిళల విద్యపట్ల, ఆసక్తిని పెంపొందించి, అభివృద్ధి పరచే అవకాశాలని విస్తృతం చేస్తారు. అంతేకాక. దేశం మొత్తం మీద మహిళల బాలికల విద్యా విషయాల సేకరణ, లెక్కల తయారింపు పరిశోధనలు, సమావేశాలు మొదలయినవి కూడ జరుపుతారు. కాలాను గతంగా సాధింప బడిన విజయాలను అప్పుడప్పుడు సమావేశమై చర్చించు కుంటారు.

ఓం ప్రధమంగా యీ కౌన్సిలువారు, మూడవ ప్రణాళికా కాలంలో బాలికల మహిళ విద్యావ్యాప్తికై 100 కోట్ల రూపాయలు కేటాయించాలని నిశ్చయించారు. ఇంతేకాక, రెండవ ప్రణాలిక మిగులు కాలంలో, 10 కోట్లు కేటాయించి, మూడవ ప్రణాలిక నాటికి విద్యావ్యాప్తికై టీచర్లను, యితర పనివారిని తయారు చేయడానికి కేటాయించాలని కూడా సూచించింది. రూపొందింప బడిన ప్రణాలికల కార్యక్రమాలు సరిగా కొనసాగడానికి గాను, సలహా సంఘాలను రాష్ట్రస్థాయిని నెలకొల్పాలని కూడా సలహానిచ్చింది. తమ మొదటి సమావేశంలోనే యీ సంస్థ వారు అనేక తీర్మానాలను చేశారు. వాటిలో కొన్ని కేంద్ర బాధ్యత ఎంతవరకూ వుండాలి? బాలికల ప్రైమరీ మరీ విద్యకై రూపొందింపవలసిన సూత్రాలు ధ్యేయాలు, ప్రత్యేక ప్రణాలికలు మొదలైనవి, బాలికల, బాలురమధ్య విద్యా విషయాలలో నున్న విపరీతపు బేధాలని తొలగించడం, వయోజనస్త్రీలకు విద్యాసౌకర్యాల అవసరాలు, ప్రయిమరీ విద్య, స్వచ్ఛంద సేవాసంస్థల సహకారాలు, పైలెట్ ప్రాజెక్టులూ మొదలైనవి ప్రారంభించడంవంటి అనేకతీర్మానాలు ఆమోదించారు.

ఇలాగే యీ సంస్థ బహుముఖంగా విద్యారంగాన్ని తిలకించి బాలికలకూ మహిళలకూ విద్యాసౌకర్యాలు సమకూర్చు తుందనడం అతిశయోక్తి కాదు.

ప్రస్తుతం విద్యారంగపు వాతావరణం సామాన్యులకి సుగమంగాలేదు. బాలికలకి విద్య కావాలంటారు, కాని తీరా పరీక్షలకు కూర్చునే సమయానికి పరీక్ష కేంద్రాలవారు. పాఠశాలల అధికారులు, కోరే నిబంధనలు నిజంగా అనూహ్యాంగా వుంటున్నాయి. యింత యిబ్బందిపడి ప్రవేటుగా పరీక్షకు వెళ్ళేకంటె ఏ కష్టాలున్నా స్కూల్లో చేరి చదవడమే మేలనిపిస్తుంది. ఇలాంటప్పుడు ధైర్యంచేసి స్వచ్ఛంద సంస్థలు మహిళలను విద్య గరిపే తరగతులను గాని, అవకాశాలను కాని ఎలా కన్పిస్తాయి? "రెడ్—టేపు" విధానం అన్ని విధాలా అభ్యుదయానికి గొడ్డలి పెట్టుగా వుంది. ఒక మహిళ పరీక్షకు వెడుతూంటే "గుర్తించ" వలసిన బాధ్యతగా పత్రం తీసుకు వెడితే చాలదు. ఒక్కొక్క ప్రైవేటు విద్యార్థిని కనీసం మూడు ఫోటోలైనా విద్యాశాఖ కార్యాలయం చేరతాయి. ఇక పరీక్ష ప్యాసయాక, సర్టిఫికేటు పంపడానికి కూడా మన బాధ్యతేగాని పరీక్షలు నడిపిన వారికి ఏ బాధ్యతాలేనట్టు వుంటారు. ఇలా ఎక్కడికక్కడ ప్రతిబంధకాలు కల్గిస్తూ విద్యా వ్యాప్తికి మహిళలు పాటు పడాలని నినదించడం, ఉపన్యసించడం, శోచనీయం. నేషనల్ కౌన్సిల్ వారీ ప్రతిబంధకాల విషయంకూడ కూలంకషంగ పరిశీలించ వలసివుంది. ఈ "రొటీను" విషయాల సంఖ్యలు తగ్గించి మహిళలకి సులభమైన అవకాశాలు కల్గించాలని అప్పుడే పరీక్షలకి కట్టడం అన్నా వెళ్ళడం అన్నా మహిళలలో ఉత్సాహం కల్గుతుంది. విద్యా వ్యాప్తికి దోహదం దొరుకుతుంది.



# రాజకీయాలు

అక్టోబరు 24 నాడు ఐక్యరాజ్యసమితి చరిత్రలో 14 సంవత్సరాలు నిండాయి. మొట్టమొదట 1948లో 51 రాజ్యాలు సమావేశమై ఆమోదించిన ప్రణాళిక (ఛార్టర్)తో ఈ ప్రపంచ సంస్థ ఏర్పాటయింది.

ఈనాడు ఈ సంస్థలో 62 దేశాలకు సభ్యత్వం ఉన్నది. సమితి సర్వప్రతినిధి సభ (జనరల్ అసెంబ్లీ)లో పెద్ద రాజ్యమైనా, చిన్నరాజ్యమైనా అన్నిటికి సమానహోదా, అధికారం, హక్కు ఉంటుంది. సమితి ప్రణాళిక లక్ష్యాలను పెంపొందించటానికి అన్ని దేశాలు తమతమ అభిప్రాయాలు వెలిబుచ్చి, వారి సన్నిధిని సమన్వయ పరుచుకోడానికి ఈ సభలో ప్రయత్నిస్తారు.

శాంతి పరిరక్షణ, నిరాయుధీకరణ, పరమాణు శక్తి శాంతికాల ఉపయోగాలు, ఆర్థికాభివృద్ధి, సాంఘికాభివృద్ధి, పరపాలనక్రింద ఉన్న ప్రదేశాల (టెరిటరీలు) ప్రజల సంక్షేమం, మానవ హక్కులు, శరణార్థుల స్థితి, అంతర్జాతీయ న్యాయ సూత్రాలను బలపరచటం వంటి అనేక ముఖ్య సమస్యలను సర్వ ప్రతినిధి సభ చర్చిస్తుంటుంది.

ఈ సర్వ ప్రతినిధి సభ చేసే నిర్ణయాలు, సభ్య రాజ్యాలకు సిఫార్సుల రూపంలో ఉంటవి. ఒక దేశపు పార్లమెంటు వలె చట్టాలు చేసే అధికారం ఈ సభకు లేదుగనుక ఏ విషయమైనా, సిఫార్సు రూపంలోనే అది చెబుతుంటుంది. ఈ సిఫార్సులను ఆమోదించి తీరాలన్న నిర్బంధం ఏమీ లేక పోయినప్పటికి ప్రపంచంలో అధిక సంఖ్యాక రాజ్యాల (దేశాల) అభిప్రాయం ఈ నిర్ణయాలలో ప్రతిబింబిస్తుంటుంది గనుక వీటికి చాల బలం ఉంటుంది.

ఏటా ఒకసారి 3 నెలల పాటు సర్వ ప్రతినిధి సభ సమావేశాలు జరుగుతుంటవి. అవసరమైతే ప్రత్యేక సమావేశమో, అత్యవసర సమావేశమో జరుగుతుంది ఈ సంస్థ ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని రూపొందించ గలదు కనుక దీనికి చాల పలుకుబడి ఉన్నది.

ప్రస్తుతం సర్వ ప్రతినిధి సభ సమావేశం జరుగుతున్నది

ఇన్ని ప్రభుత్వాల ప్రతినిధులు, ఈ సమావేశాలకు చేరుతుంటారు. గనుక పరస్పరం ఒక ప్రభుత్వం అభిప్రాయాలు మరొక ప్రభుత్వం తెలుసు కొనటానికి కూడా ఇది మంచి అవకాశం ఇస్తుంటుంది. దాదాపు ఈ సభ సమావేశాలన్నీ కూడా ప్రజలు వెళ్ళి చూడవచ్చును. ఈ సభ తాలూకు పనిలో ఎక్కువభాగాన్ని నిర్వహించే ఉపసంఘాలు ఏడు ఉన్నవి. వాటి సమావేశాలు కూడా ప్రజలు ఎవరైనా చూడవచ్చును.

శాంతి సద్భావాలకోసం దేశాలమధ్య సహకారం సాధనకూ కృషి చేయటంలో సమితి కృషి పటుతరంగా జరగడానికి దాని అనుబంధ సంస్థలు ప్రజారోగ్యం, ఆర్థిక, సాంఘికాభివృద్ధి వంటి విషయాలలో బడుగు దేశాలలో ఎంతో కృషి చేస్తున్నవి.

ఐక్యరాజ్య సమితి 1947 నుంచీ తన అనుబంధ సంస్థల సహకారంతో అడిగిన దేశాలకు సాంకేతిక సహాయ కార్యక్రమాలను ఆమోదించింది. ఈ కార్యక్రమాలకు సభ్యదేశాలు గాని, ప్రత్యేక సంస్థలుగాని, లేదా ఈ ఉభయులుగాని విరాళాలు ఇవ్వటం జరుగుతుంది.

ఈ విస్తృత కార్యక్రమం క్రింద దాదాపు 120 దేశాలు, టెరిటరీలకు సాంకేతిక పరిజ్ఞానం అందజేయటానికి గాను 70 దేశాలనుంచి 5,000 మందికి పైగా అర్హులైన సాంకేతిక నిపుణులను సమితి సమీకరించినది. వెనుక చిక్కిన దేశాలవారు ఆయా రంగాల ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం పొందడానికి వీలుగా సమితి ఫెలోషిప్పులు (సహాయ వేతనాలు) కూడా ఇస్తుంటుంది. ఆయా ప్రాంతాలలో శిక్షణ కేంద్రాలు విద్వద్గోష్ఠులు (సెమినార్స్) ఏర్పాటు చేసి ఆయా సాంకేతిక రంగాలలో పలు దేశాలు తమతమ అనుభవాలను, ఆలోచనలను పరస్పరం తెల్సుకొనే అవకాశం కల్పిస్తుంటుంది.

కనుక సమితి వార్షికోత్సం జరపటం అంటే ఒక్క సర్వ ప్రతినిధి సభకేగాక ఈ ప్రత్యేక రంగాలలో కృషిచేసే దాని అనుబంధ సంస్థ అన్నిటికీ జోహారు లర్పించుటనే అవుతుంది అంటే మానవకోటి కల్యాణానికి జరిగే సత్కృషిని ఏటా ఒకసారి అందరూ మనసం చేసుకోవటం అవుతుంది.

♦ ♦ ♦

దశమ వార్షికోత్సవాన్ని జరుపుకొన్న చైనా ప్రజా రిపబ్లిక్ చైనాదేశ కమ్యూనిస్టుపార్టీ నిర్దేశించిన ఉజ్వల విధానాన్ని అనుసరించి చైనా ప్రజలు సోషలిస్టు నిర్మాణాన్ని విజయవంతంగా కొనసాగిస్తున్నారు. "సోషలిస్టు నిర్మాణంలో మహోన్నత లక్ష్యాలను పెట్టుకొని, పరిపూర్ణంగా నిమగ్నమై వేగంగా, ఉత్తమమైన విజయాలను పొదుపుగా సాధించాలన్నదే ఆ విధానం.

1959 ప్రథమార్థభాగంలో జాతీయార్థిక రంగంలోని వివిధ శాఖల్లో ఉత్పత్తి గడిచిన సంవత్సరం లాగనే కనీ వినీ యెరుగనంత బ్రహ్మాండంగా అభివృద్ధిని పొందింది.

ఈ కాలంలో మొత్తం పారిశ్రామికోత్పత్తి, గత సంవత్సరపు యిదే కాలంతో పోల్చి చూచినట్లయితే 65 శాతం పెరిగింది. రైల్వే మార్గాలపైన రవాణ చేయబడిన వస్తువుల బరువు 49శాతం అధికమయింది. వ్యవసాయ రంగం సంబంధించినంత వరకు, గత శీతాకాలంలో సేద్యపుభూమి ప్రమాణం కొంత తగ్గిపోయినా, అనేక ప్రాంతాలు అతివృష్టి, అనావృష్టులకు గురి అయినా యీ వేసంగిలో ఎకరానికి పండిన పంట ప్రమాణం హెచ్చింది. వరి, రేప్‌గింజల పంట సమృద్ధికరందా పంట పండిన 1958 వ సంవత్సరపు ప్రమాణాన్ని బాగా మించి పోయింది.

ప్రణాళికలో ఉద్దేశింపబడిన ప్రకారం యీ సంవత్సరం ఉక్కు ఉత్పత్తి (స్థానిక పద్ధతులలో ఉత్పత్తి చేయబడేది కాకుండా) 12 మిలియన్ టన్నులకు. అనగా 1958 కంటే 24 శాతం అధికంగా ఉత్పత్తి

చేయ బడుతుంది. పత్తి, ధాన్యాల ఉత్పత్తి చేయబడు తాయి. ఈ సంవత్సరం సాధింపబడిన ఆర్థికరంగ విజయాలు చైనాకు రెండవ పంచవర్ష ప్రణాళికకు చెందిన 1961 లక్ష్యాలను పూర్తిచేయడానికి లేదా ఇంకా మించి పూర్తిచేయడానికి తోడ్పడతాయి. ఉక్కు, బొగ్గు, కలప లోహరాంత్ర పరికరాలు, విద్యుత్ యంత్ర పరికరాలు, నూలు, కాగితం, ఉప్పు, ధాన్యం, పత్తి మొదలైన వాటి ఉత్పత్తిలో ఇలా జరుగుతుంది. "ప్రధాన పారిశ్రామిక వస్తువుల ఉత్పత్తి విషయంలో బ్రిటన్ స్థాయిని 15 సంవత్సరాల్లోపల అందుకోవాల"న్న నినాదం 1957 లో ఇవ్వబడింది. కాని ఆలక్ష్యం పదిసంవత్సరాల్లోనే సాధింపబడుతుంది వ్యవసాయాభివృద్ధికి సంబంధించిన 12 సంవత్సరాల కార్యక్రమాన్ని 1967 నాటికల్లా పూర్తి చేయాలని 1956 లో నిర్ణయింపబడింది. కాని ఆ లక్ష్యాలు అనుకొన్నదాని కంటే ముందే, వేసుకున్న అంచనాల కంటే యెక్కువగానే సాధింప బడవచ్చును.

సాంస్కృతిక నిర్మాణంలోగూడా బ్రహ్మాండమైన అభివృద్ధి సాధింపబడుతుంది. ప్రజల జీవనప్రమాణాలు గూడా బాగా పెరిగాయి. ఇప్పుడు జరుగుతున్న ఆర్థిక సాంస్కృతికాభి వృద్ధి ఫలితంగా జీవన ప్రమాణాలు ఇకముందు మరింతగా పెంపొందుతాయి.

♦ ♦ ♦

## సుస్థిర శాంతికి త్రికరణశుద్ధిగా కృషి చేస్తున్న అమెరికన్ ప్రెసిడెంట్

డ్వయట్ డేవిడ్ ఐసెన్‌హోవర్ 69 వ జన్మ దినోత్సవం అక్టోబరు 14 వ తేదీన జరుపుకున్నారు. ప్రపంచంలో న్యాయమైన, సుస్థిరమైన శాంతి స్థాపన కావాలనే ఆశయానికి ఆయన చిహ్నంవంటి వాడు.

తన ప్రభుత్వ లక్ష్యమైన న్యాయమైన సుస్థిర శాంతి సాధనా యత్నంలో తన ఆరేళ్ళ అమెరికా అధినేతృత్వంలో పశ్చిమ ఐరోపా నాయకులతో సమాలోచన కొనసాగించేనిమిత్తం అట్లాంటిక్ సముద్రం దాటి మూడుసార్లు విదేశ యాత్రలు చేశారు.

ఇటీవల ఆగస్టు 26 న పశ్చిమ ఐరోపా నాయకులతో సంభాషణల నిమిత్తం ఆ దేశాలకు వెళ్ళటం ఆయన అధ్యక్షపదవి కాలంలో చేసిన గొప్ప కార్యాలలో ఒకటి. గత మాసంలో సోవియట్ ప్రధానికి కృశ్చేవ్ అమెరికా పర్యటించటం ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్ రష్యా సందర్శించబూనటం దృష్ట్యా ఆ సంభాషణలకు మరింత ప్రాధాన్యత వచ్చింది.

1955 జూలైలో జెనీవాలో నాలుగు అగ్రరాజ్యాల అధినేతలు 'శిఖరాగ్ర' సమావేశం జరిపిన సందర్భంలో శ్రీ ఐసెన్‌హోవర్ ప్రెసిడెంటుగా తొలిసారి ఐరోపా యాత్ర చేశారు. ఈ సమావేశంలోనే శ్రీ ఐసెన్‌హోవర్ తన చరిత్రాత్మక "ఓపెన్ స్కైస్" ప్లాను ప్రతిపాదిస్తూ నిరాయుధీకరణ చర్యగా ఆకాశ తనిఖీ పద్ధతి కావాలని వాదించారు.

భావి ప్రపంచ శ్రేయస్సుకు ప్రెసిడెంట్ ప్రతిపాదించిన మరొక ముఖ్య పథకం శాంతి ప్రయోజనాలకు పరమాణు శక్తి అభివృద్ధి.

"మానవుని అద్భుత ఉపజ్ఞను అతడి నాశనానికి గాక, అతడి ప్రగతి జీవనానికి వినియోగించబడాలి" అనే మహత్తర సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ శ్రీ ఐసెన్‌హోవర్ 1953 లో సమితి సర్వ ప్రతినిధి సభలో చేసిన ప్రసంగపు సారాంశమే 1955 లో జెనీవాలో జరిగిన సమితి తొలి పరమాణు శక్తి శాంతి ప్రయోజనాల సమావేశపు ఇతి వృత్తమైంది.

ప్రపంచ నాయకుడుగా ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్ చేసిన మరి కొన్ని మహా కార్యాలలో బ్రిటిష్ ప్రధాని హెరాల్డ్ మెక్‌మిలన్‌తో 1957 లో బెర్మూడా సమావేశవేశం, ప్రెసిడెంట్‌గా ప్రమాణ స్వీకారం చేయక ముందే 1952 లో కొరియా యాత్ర, 1957 లో ప్రధాని నెహ్రూ ప్రభృతి పలువురు విదేశ నాయకులతో వాషింగ్టన్‌లో ప్రపంచ శాంతి మార్గాల గురించి చర్చించటం వంటివి కలవు.

ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్ తన ప్రభుత్వాన్ని శాంతి స్థాపనకు అంకితం చేస్తారని అంతకు ముందే భావించటం జరిగింది. ప్రపంచంలో మహా శక్తివంతమైన సైన్యాన్ని నడిపించిన అనుభవం ఆయనకున్నది. యుద్ధాల వల్ల కలిగే అనర్థాలు, నష్టకష్టాలు ఏమిటో అందరికంటే ఆయనకు బాగా తెలుసు. ఆయన పట్టభద్రు లవుతున్న విద్యార్థులకు చెబుతూ ఉండే సలహా ఇది: "నాకు విశ్రాంతి ఇవ్వటం మీ బాధ్యత."

ప్రపంచ శాంతి స్థాపనా కృషి క్రమక్రమంగా జరగాలనీ, ఓర్పుతో జరగాలనీ ఆయన విశ్వాసం

ఆర్థిక విషయాలలో, ప్రపంచంలో స్వేచ్ఛా వాణిజ్యం జరగాలని ఆయన ప్రగాఢ వాంఛ. ఆయన ప్రభుత్వంలో విదేశ సహాయ కార్యక్రమం సైనిక సహాయం నుంచి బడుగు దేశాలకు ఆర్థిక సహాయం వైపు మొగ్గింది.

శ్రీ ఐసెన్‌హోవర్ మతంలో గట్టి విశ్వాసం కల వ్యక్తి. అది తలిదండ్రులు తనకు నూరిపోసిన విశ్వాసం. ఈయన 1890 వ సంవత్సరం అక్టోబరు 14 వ తేదీన జన్మించారు. ఈయన తలిదండ్రులు డేవిడ్, ఇడా ఐసెన్‌హోవర్‌లకు ఈయన మూడవ పుత్రుడు. ఈయన పుట్టిన రెండేళ్ళకు ఆయన కుటుంబం కాన్సాస్ రాష్ట్రంలో అబిలిన్‌కు తరలి వెళ్ళి అక్కడ స్థిరపడినారు. అక్కడ ఈ భావి అమెరికా ప్రెసిడెంటు సోదరులతో, స్నేహితులతో ఆడిందీ పాడిందీ, చదివిందీను. అక్కడే ఆయన పొలంలో పని చేశారు,

1911 లో ఆయన వెస్ట్‌పాయింట్ లోని అమెరికా మిలిటరీ అకాడమీలో చేరాడు. తర్వాత 41 సంవత్సరాల పాటు సైనిక రంగంలో పురోగమించారు. 1952 లో ఆయన సైనిక వ్యాసంగం సమాప్తమైంది. తర్వాత కొన్ని వారాలకే అమెరికా ప్రెసిడెంటు గిరీకి రిపబ్లికన్ పార్టీ అభ్యర్థిగా నియమితుడైనాడు.

ఆయన ప్రజా రంజకుడైన ప్రెసిడెంట్, ఒక ప్రజాభిప్రాయ సేకరణంలో ఆయన ప్రభుత్వాన్ని అత్యధిక ప్రజలు ఆమోదించారు.

• • •

## భారత సమాజాభివృద్ధి అనుభవాలు తెలుసుకోటానికి ఘనా అధికారి రాక

ఘనా ప్రిన్సిపల్ కమ్యూనిటీ డెవలప్‌మెంటు ఆఫీసరు శ్రీ జాన్ ఆకోవా సలామ్ ప్రస్తుతం భారత దేశంలో పర్యటిస్తూ దేశంలో వివిధ సామాజాభివృద్ధి, శిక్షణ కేంద్రాలు పరిశీలిస్తున్నారు.

అమెరికా సాంకేతిక సహకార సంస్థ తాలూకు మూడవ దేశ ("థర్డు కంట్రీ") శిక్షణ కార్యక్రమం క్రింద ఆయన రెండు నెలలు భారత దేశంలో సమాజాభివృద్ధి కృషి పరిశీలన జరపటానికి వచ్చారు.

ఈ కార్యక్రమం క్రింద అమెరికా 60 దేశాలలో గల తన సాంకేతిక సహకార సంస్థల ద్వారా ఇట్లా ఒక దేశం వారు మరొక దేశంలో (అమెరికా గాక) శిక్షణ పొందటానికి అన్ని వసతులు కల్పిస్తుంది. ఈ పాల్గొనే వారి దేశంలో ఉన్న పరిస్థితుల వంటివే గల మరొక దేశంలో ఇట్టి పరిశీలనకు ఏర్పాటు చేస్తారు ఇట్లా ఒకే రకం సమస్యలు పద్ధతులు, పరిస్థితులు గల దేశాలను పరిశీలించటం వల్ల మరింత ఉపయోగం ఉంటుంది. ఇందువల్ల, ఇట్లా పాల్గొన్న అభ్యర్థులు తాము గడించిన పరిజ్ఞానాన్ని స్వదేశంలో వినియోగించటానికి వీలవుతుంది.

ఇంతవరకు అమెరికా ఈ కార్యక్రమం క్రింద భారత దేశానికి 15 దేశాల నుంచి వివిధ రంగాలలో శిక్షణ నిమిత్తం 1955 నవంబరు నుంచి ఇంతవరకు 192 మందిని పంపింది.

భారత దేశంలో పరిశీలించ కోరేవాటిలో సమాజాభివృద్ధి కార్యక్రమం మలేరియా నిర్మూలన, పౌర విమాన యాన రంగం ముఖ్యమైనవి.

• • •

## సింహళ ప్రధానిహత్య

సింహళ ప్రధాని శ్రీ బండారనాయక్ దారుణంగా హత్య కావింప బడ్డాడు, శస్త్ర చికిత్స చేసీ ప్రయోజనం లేకపోవడం, బంగారంవంటి మనిషి ప్రజలకు దూరం అయాడు సింహళం యావత్తూ శోకాంబుధిలో మున్గింది,

బౌద్ధబిక్కుల వంటి వారే యీ హత్యకు పాలు పంచుకొన్నారన్నది యీ సంఘటనను యావత్తూ మరీ విషాదకరం చేస్తూంది.

పోలీసు బలగం అంతా తమశక్తులకు కేంద్రీకరించి అనుమానితులను చుట్టుముట్టి ముట్టుతున్నారు. ఇంకా యిదమిద్ధంగా నిందితులు తేలలేదు. ఏమైనా మంచితనానికి కిరాతక మరణం ప్రకృతి విరుద్ధం. శోచనీయం.




# అధర్వణ వేదము—ఆంధ్రులు

వేదములు నాలుగట. అవి వేదభాషలో రచింప బడినవట. ఆ భాష సంస్కృతమునకు దగ్గిర చుట్టమట. పై రెండు భాషలు రానివారు ఇంగ్లీషులో చదివి తెలుగులో అర్థము చేసుకోవచ్చును. ఈమధ్య తెలుగులోనే చదవి, ఆంగ్లములో అర్థమ్ము చేసుకునే అవకాశములు ఏర్పడినవట.

అసలింత, కష్టపడి వేదములు చదువవలసిన అవసరము ఏమి వచ్చిందని అడగవచ్చును. అది చాలా సబబైన ప్రశ్న. అసలు ఆ మాటకొస్తే ఏ పుస్తకమైనా ఎందకు చదవాలి? డిగ్రీకోసము, పరీక్షలకోసము చదవటము వేరే సంగతి. కాని వూరికినే వుండలేక. పుస్తకాలు కొని చదవటము దేనికి? వూరికేనే దొరికిన పుస్తకమైతే పుబుసుపోకకు చదువుకోవచ్చును. కాని పుస్తకము కొని చదవటము చాలా అవివేకముగా కనబడుతుంది, తప్పనిసరిగా కొనవలసినవెన్నో వుంటే, డబ్బు కరువురోజులలో పుస్తకాలు కొనటమేమటి? పుస్తకాలకు పెట్టింది పువ్వులకు పెట్టింది డబ్బు వట్టి దండుగే.

అయినా ఎరుగని పుస్తకాలలో ఏముందో చూద్దామనే కుతూహలము ఒక్కొక్కసారి వ్యసనమువలే మనలను పట్టుకుంటుంది. అందుకే చదువకూడని పుస్తకాలు విద్యార్థులు క్లాసుపుస్తకాలక్రింద పెట్టి చదువుతారు. అక్షరజ్ఞానములేని రాజకీయ వేత్తలు తాజా వార్తలనిచ్చే పత్రికలోని సంగతులు బట్టి పడారు, నవయువ్వనులు ప్రబంధాలలోనికాముకులసంభాషణలు కష్టపడి నేర్చుకుంటారు. సాహిత్య పిపాసకలవారు అర్థముకాని పుస్తకాలు చదువుతారు! మనమందరము తరచూ ఋగ్వేదము సామవేదము సంగతి వింటూ వుంటాము. అధర్వణవేదము సంగతి అంతగా ఎప్పుడూ వినము, మొన్నీమధ్య అనుకోకుండా అధర్వణ వేదములోని చిత్ర విచిత్ర విశేషములు వినే అవకాశము కలిగింది. ఆ విషయాలు వినగానే నా మానసిక ప్రపంచములో భారత దేశానికి ఒక ఉత్కృష్టస్థానమిచ్చాడు. భారత నాగరిక తకు అధర్వణవేదమునకు అగ్రస్థానమిచ్చి హృదయ నీరాంజనమిచ్చి. నేను ఆంధ్రుడుగా. భారతీయుడుగా జనించినందుకు నన్ను నేను అభినందించు కున్నాను. ఆనందము ఎక్కువైనప్పుడు మనలను మనము అభినందించుకోవటముతో వూరుకోబుద్ధికాదు. ఇతరులను కూడా అభినందించాలన్ని బుద్ధి పుట్టుతుంది. ఇప్పుడు మేము మీ గొప్పలు చెప్పి మిమ్ముల అభినందించ దలచాము.

శాస్త్రములు చదువకయే. పరిశోధనలు చేయకయే భారతీయులు అన్ని శాస్త్రముల సారములు గ్రోలిరి. ఎట్లు? అనోట ఆనోట అందించిన అనుభవమే మనకివ్వని బిరుదులు. భారతీయులలో అగ్ర తాంబూలము అందుకొన వలసినవాడు ఆంధ్రుడు. ప్రతి ఆంధ్రుడు అభివందనీయుడు. ఆంధ్రుడవై పుట్టుట

లోనే ఒక విశేషమున్నది. ధర్మశాస్త్ర పురాణములు హృదయముగా గలది తెలుగట. అందుకనే ధర్మ. శాస్త్ర పురాణములను ఆంధ్ర దేశమున అంత విరివిగా చదువుచుందురు. వకల్తాలేని వకీలు పట్టభద్రులు ఆలయావరణములోనేగాక అరుగులమీద పురాణకాలక్షేప కార్యములు సాగించు పండితోత్తములు అందుకనే ఆంధ్రదేశమున కోకొల్ల—మెట్ట వేదాంతము అందుకనే విరివిగా అచ్చుట తయారవుచున్నది. అయితే మన చుట్టు ప్రక్కనున్న వారి సంగతేమిటని మీకు సందేహము రావచ్చును. అధర్వవేద అధ్యాయ ప్రకారము—తర్క వ్యాకరణములు హృదయముగా గలది తమిళమట. అందుచేతనే అక్కడ లక్షలు సంపాదించే వకీళ్ళు పుట్టారు. జ్యోతిష్య భైషజ్యములు హృదయముగాగలది మళయాళము కషాయాలు తైలాలు అక్కడ ఎందుకు తయారవునో మీకు విశదము. మీమాంసాన్యాయములు, హృదయము గాగలది మహారాష్ట్రము- అందు చేతనే బొంబాయి మహారాష్ట్ర విభజన సమస్య మీమాంసగనే మిగిలిపోయింది ఛందస్సు నిరుకము హృదయము గాగలది వుత్కళమట. శిక్షా కల్పములు హృదయము గాగలది కర్నాటకమట- వేదమునే పరిభాషగా వుపనిషద్దమున వ్యవహరించునది నిన్ధ్యము. ఉద్గాత్ర లక్షణమున వ్యవహరించునది సింహాళ భాష. వీరందరూ అధర్వానికి చెందినవారట. అంటే ఈ ఆధర్వణ దేశమున నున్న ఈ ఆరు భాషలున్నూ ఆరు శాస్త్రముల అంతరార్ధమును ప్రకటించునదట. అవి ఆరు ఆధర్వానికి చెందినవట. అందుచే ఈ షటశాస్త్రముల హృదయమైన ప్రాంతీయ భాషలు గలవారు అధర్వీయులు వీరు ఆత్మార్ధ పరులట, అంటే ఇంతకీ తేలిన విషయము, మనము అధర్వీయులము, ఆత్మార్ధపరులము.

ఈ అధర్వవేదము కూలంకాషము చదువ వలసిన అగత్యమున్నట్లు తోచుచున్నది. ఈ వేదములోని విషయాలు మోక్షానికి దారి చూపేవికావట- ఇహామే గానిపరము ప్రసక్తే లేదట. అది పూర్తిగా మన నిత్య వ్యవహారిక జీవితములో సహాయపడు విషయములను గురించి తెలుపునట. దానిని ఆంగ్లములో matenalistic వేదమంటారు. ఆవేదములో నేటి

లైట్సు ఎట్లా పంపాలో- అణ్వస్త్రములు ఎలా తయారుచేయాలో, విమానములు ఎట్లా నిర్మాణము చెయ్యాలో, ఆహార సమస్య ఎలా పరిష్కారము చెయ్యాలో తెలియపరచి వున్నవట- రెండవ ప్రపంచ సంగ్రామములో హిట్లరుమహాశయుడు ఈ అధర్వణ వేదములోని విషయాలు పరిశోధింప చేసి దాని ప్రకారమే అణ్వస్త్రములు తయారు చేయించాడని కొందరి నమ్మకము. అయితే హిరోషిమా ఆపదకు మనము, మన ఆధర్వణ వేదమే కారణమన్నమాట! రామ రామ, పాపము శమించుగాక, ఈ పాపాని కంతా మనమేనా బాధ్యులము?

ఈ వేదములో ఇలాంటి ప్రమాదకరమైన విషయాలుండబట్టే గాబోలు మన పెద్దలు ఈ వేదమున కంత ప్రాముఖ్యం నివ్వలేదు. కాని కీడులో మేలున్నది. ఈ ప్రమాదకరమైన అధర్వణ వేదములో కొంత లాభకరమైన విషయాలు కూడా వున్నవి. ఈ అణ్వస్త్రాలకి తిరుగుడు ఆయుధము కూడా తెలిపే వున్నవట- ఇంకో హిట్లరంటి వ్యక్తి పరిశోధన జరిపితే గాని అదిబైటపడదు. అంతేకాదు అదృశ్యంగా విమానములో వెళ్ళు విధము, అదృశ్యంగా విమానము వెళ్ళుచున్నప్పుడు కనుగొనే విధము, గ్రహాలు, వుపగ్రహాలు సృష్టించే విధము కూడా వున్నవట. విషయములన్నీ సాంగోపాంగముగా పరిశోధించితే సే దేశరక్షణకు వుపయోగపడగలవు. ఇతర దేశములతో పాటు సరిసమానమైన స్థానములో నిల్వవచ్చును. మన గొప్పలు చెప్పుకుంటున్నామంటారు కొందరు పెద్దలు- విమానాలు చెయ్యటము. మాకు తెలుసయ్యా అంటే ఇదివరలో కొందరు నవ్వారు. ఈ మధ్య మైసూరు ప్రభుత్వానికి దొరకిన భరద్వాజుని aeronautics గ్రంథము మన ప్రతిభను ఋజువు పరచింది. అంతేగాక అదృశ్య విమానములు చేయుట కూడా మన భారతీయు లెరుగుదునని తెలసి ఎట్లా మనము మనలను అభినందించుకోకుండా వుండగలము!!

అధర్వణవేదములో వర్షము సృష్టించే విధము కూడా తెలిసియున్నదట, ఆ విధానము ప్రకారము పరిశోధనలు జరిగినవట- వర్షము కురిపించిరట.

పీటన్నిటి కన్నా ముఖ్యమైన మరియొక్క విష యమున్నదట అది ఆహార సమస్య పరిష్కార విధము. ఆరు రోజులలో వరి. గోధుమలు పండించ వచ్చునట. ఈ విషయమున కొందరు పరిశోధనలు చేయుచున్నారు. వారు కృతకృత్యులవాలనే మనము కోరు కొందుము. ఆరు రోజులలో పంట పండితే మన ఆహార సమస్య తీరినట్లే అప్పుడు జపాను వరి సాగు. చైనా వరిసాగు మన వరిసాగుకు బలాదూరు కాగలదు.

ఆహార సమస్య తీరిపోతే మానవులకు ముఖ్యమైన మరి రెండు సమస్యలు మిగిలిపోతవి. అది వస్త్రము. ల్లు . మానవులకు కావలసినది ముఖ్యముగా తిండి. బట్టా. ఇల్లుకదా. బట్టలు బొంగులలో నుంచీ ఇంకా ఏదో ఏదో పదార్థాలతో ఇప్పుడు శాస్త్రవేత్తలు తయారు చేస్తున్నారు కదా? ఇప్పుడు మనకు దూది. పట్టు లేకుండానే నైలాను మొదలగు వస్త్రములు తయారు చేస్తున్నారు— అయితే ఇళ్లు సులువుగా కట్టుకునే విధము తెలియాలి. అపైన డబ్బుకూడా వుంటే బాగుంటుందికదా? బంగారము చేసే విధను ఏమైనా వ్రాశారేమో. ఈ గృహ కనక వుత్పత్తి విధానములు తెలుసుకొనుట కొరకైనా అధర్వణ వేదము చదివితే బాగుంటుందేమో. అధర్వణవేదము చదువుతారా?

కష్టేఫలి.



---

# కావలెను

ఈ క్రింద నుదహరించిన కోర్సులలో గవర్నమెంటు పరీక్షలలో నుత్తీర్ణు లయిన వారినుండి దరఖాస్తులు కోరబడుచున్నవి.

1. మిడ్వైఫరీ
2. నర్సరీ; ఎలిమెంటరీ టీచర్సు ట్రైయినింగ్
3. అల్లిక, కుట్టుపని.
4. ఎంబ్రాయిడరీ
5. టెయిలరింగ్
6. కట్టింగు

విద్య, వయస్సు యోగ్యతాంశములు అనుభవములు, మొదలగు విషయములు తెల్పుతూ ఈ క్రింది చిరునామాకు వ్రాయకోరుతాము.

జాయింటు సెక్రటరీ
ఆంధ్ర మహిళాసభ
24. ఏ లజ్ చర్చిరోడ్డు
మైలాపూరు మద్రాసు 4.

నా విదేశయాత్ర :

# స్టాక్‌హోములో

## శ్రీమతి వి. ఎల్. పార్వతీ హనుమంతరావు

26–7–1959 తేదీన ఉదయము పదునాల్గవ అంత ర్జాతీయ, శాంతి స్వాతంత్ర్య మహిళాజనసభకు భారత దేశపు ప్రతినిధులుగా మాపేర్లు నమోదు చేయించుకొనుటకు బయలుదేరి వెళ్ళాము. పూర్వపు మహాసభలకు వచ్చినట్లుగానే ప్రపంచపు నలుమూలలనుండి రాజకీయ తారతమ్యాలు ఏమీలేకుండా ఈసభను జయప్రదం చేయటానికి ప్రతినిధులు వచ్చారు, కాని ఆష్ట్రియా, న్యూజిలాండు, ఇండియా, అమెరికా దేశాలనుండి పూర్వవం జరిగిన సభలకన్నా ఎక్కువ మంది ప్రతినిధులు రావటం ఒక ప్రత్యేకతగా అచ్చటి వారంతా పరిగణించారు.

యీ మహాసభలో జరిగిన చర్చలు చేసిన తీర్మానాలుచూస్తే ప్రతిదేశపు ప్రభుత్వము యు. ఎన్. కూడ యీ మహాసభకు ఎందుకు విలువిచ్చి ప్రోత్సాహపరుస్తూందో తెలుస్తుంది.

ఆరోజు మధ్యాహ్నపు భోజనానికి భారతదేశపు ప్రతినిధులందరినీ ఒక స్వీడన్ ఆమె ఆహ్వానించింది. ఆమెభర్త, పేరుగల కళాకారుడు. ఆమెయిల్లు సామానులు, రకరకాలు, ఆయింట్లో సర్దుకొన్న పద్ధతి చూస్తే ఎంతో ముచ్చటగా వుంది.

మా సభా కార్య క్రమాలన్నీ పార్లమెంటు భవనంలో జరిగాయి. రెండవరోజు సాయంకాలం సభా ప్రతినిధులందరకూ టవునుహాలులో మేయర్ పార్టీ యిచ్చారు. ఆ దేశనాయకులందరూ కూడావచ్చారు. నోబుల్ ప్రయిజుపొందిన ప్రొఫెసర్ పాల్ ప్రసంగించారు. మూడవరోజు అచ్చటివారు ప్రతినిధుల కొరకు కంగ్‌స్ట్రేడ్‌గార్డెన్‌లో ఒకనృత్య ప్రదర్శనంకూడా యిచ్చారు, అప్పుడు అచ్చట అంతా కల్సుకొనటానికి, మంచీ చెడూ మాట్లాడుకొనటానికి, ఎవరెవరు ఎచ్చట నుండి వచ్చారో తెల్సుకొనటానికి, ఎంతో అవకాశమేర్పడింది, ఆనృత్య ప్రదర్శనానికి, మనదేశంలో మనంచూసే, మననృత్యప్రదర్శనాలకు, సంబంధం ఎచ్చటాలేదు, నాకు ఆ నృత్యం అంతగా అర్థంకాకపోయినా, ఎంతగా ఆనందించానో చెప్పలేను.

ప్రతిరోజు కమిటీల సమావేశాలు జరగటం, ఎవరో ఒకరు ప్రపంచ విషయాలను గూర్చి మాట్లాడటం, చర్చలుజరగటం, తీర్మానాలు ఆమోదించటం మొదలగు సభా కార్యక్రమములలో తీరిక లేకుండాయుండేది. సభా నిర్వాహకులు, ప్రతినిధులు అనేక చరిత్రాత్మకస్థలాలు చూడటానికి అవకాశంకూడా కల్పించారు. అమెరికానుండి ఒకామె ప్రతినిధిగా. ఆమె స్వంతకారులో వచ్చింది, ఆమె, ఆమెపుత్రుడు మమ్ములను వాళ్ళకార్లో తీసుకెళ్ళి దాదాపు స్టాకుహోమంత చూపెట్టారు. వారి సహకారాన్ని మర్చిపోవటం కష్టం.

భారతదేశ శాంతి, అహింసా సిద్ధాంతాన్ని మహాత్మాగాంధీజీ, అంతరంగిక కార్యదర్శిని శ్రీమతి సుశీలానాయరు ప్రతినిధులకు అందజేశారు, ఆమె వుపన్యాసాన్ని అచ్చటివారు ఎంత కొనియాడారో చెప్పటం చాలాకష్టం, ఆమె ఒకసారి తన వుపన్యాసంలో అసూయ, ద్వేష, భేద భావాలు ఎలా వుద్భవించి, ఎలా పెంపొందుతవో కొద్దిలో చాలా విపులంగా చెప్పారు. పసిపాప కళ్ళు తెరచి, ఫలానవారు తల్లిఅని, తెల్సుకొనగల్గి నప్పటినుండి యిష్టాయిష్టాల విషయాలలోగాని, అంగీకారానంగీకార సమస్యప్పుడుగాని, తల్లికళ్ళనుండి జవాబును పొందటం నేర్చుకొంటుంది, అలాగే అతనా వాతవరణానికి, అనుగుణ్యాంగా విషయాలు తెల్సుసుకొని పెరిగి పెద్దవాడవుతాడు, అలా అవేశంతో, చిన్ననాడుకల్గి, పెంపొందిన గుణగణాలను తరువాత మార్చటం చాలాకష్టం, కాబట్టి ప్రపంచాన్ని అసూయ, ద్వేషభేద భావాలనుండి రక్షించటానికి తల్లిఏమి చేయకల్గుతుందో ప్రపంచ శాంతి నిర్మాణానికి తల్లి సహాయం ఎంత అవసరమో, సమాజంలో ఆమెకు ఎంత అగ్రస్థానంయుందో తెలియపర్చారు.

ప్రపంచ సమస్యలన్నీ యు. ఎన్ ద్వారా, సామరస్యంగా స్వార్థరహితంగా పరిచేసుకొన ప్రయత్నించాలని ఆర్థికంగా వెనుక బడియున్న అనేక దేశాలకు వేరు, వేరు దేశాలద్వారాగాక యు. ఎన్. ద్వారా ఆర్థిక సహాయంచేసి తిండి బట్ట చదువు సంధ్యలులేనట్టి పీడితప్రజానీకపు ప్రగతికి తోడ్పడాలని తీర్మానించారు.

కుల, మత, వర్గ, రంగు భేదాలులేని ప్రపంచసాంఘిక జీవితంగూర్చి ఆలోచించారు, అమెరికావంటి

వున్నత దేశంలోనూ దక్షిణాఫ్రికాలోని నీగ్రోలకు, తెల్లవారికి మధ్యప్రాచ్యంలో అరబ్బులకు జ్యూలకు, ఉత్తరాఫ్రికాలో నీగ్రోలకు ఫ్రెంచి వారికి నానాటికి ద్వేషభావాలు పెరిగి పోవటంగూర్చి సభవారు సంతాపాన్ని వెలిబుచ్చారు. సహకార సామరస్యాలలో బ్రతకటం మానవజన్మ హక్కుగా ప్రతివారు గుర్తించాలనీ అలాంటి ప్రపంచ వసుదైక కుటుంబసమాజం కొరకు ఈ సంఘం పట్టుబట్టి పనిచేయాలని తీర్మానించారు.

ఎలాంటి సమస్యనైనా యుద్ధమేకంతో ఆలోచించక యునైటెడ్ నేషన్సు ద్వారాగాని, మధ్యవర్తుల రాయబారుల ద్వారాగాని, ఆయాదేశాల ప్రతినిధుల సమావేశాల ద్వారాగానీ సరిచేసుకోవాలని అలాంటి సమావేశాలవల్ల ఆలా ఎదురు బొదురుగా కూర్చుని మాట్లాడుకొనుటవల్ల చాలా చిక్కు సమస్యలను పరిష్కరించు కొనవచ్చునని యీ సభవారు ఆశాభావాన్ని వెల్లడింగారు.

ఆయుధ విసర్జన మారణయంత్ర నిషేధం ప్రపంచ శాంతికి మధ్యమ సోపానమని పెద్దపెద్ద దేశాలు వారి ఆర్థిక, శక్తి సామర్థ్యాలు వైజ్ఞానిక విజ్ఞానం మానవ కల్యాణానికి, తినటానికి తిండి, కట్టుకోను బట్ట. వుండటానికి యిల్లు, విద్యాసౌకర్యాలు లేక యీసురోమంటూ బ్రతుకుచున్న మానవాళి మహోదయానికి తోడ్పడాలని, దీని విషయం యు. ఎన్. తగిన శ్రద్ధను తీసుకొని యీ సమస్యను తక్షణమే పరిష్కరిలచాలని యీ సంఘం తనశక్తి కొలది మద్ధతు నివ్వాలని కోరుతూ అహింసా మార్గమే. ప్రపంచ శాంతి భద్రతలకు ప్రథమ సోపానమని నొక్కివక్కాణించ్చారు.

హక్కు సభా స్వాతంత్ర్యమును గూర్చి మాట్లాడుడుతూ ప్రతివారు ప్రతి విషయాన్ని తెల్సుకొనటానికి చెప్పటానికి హక్కుయున్నదని అలాంటి హక్కు కొరకు మానవ పోరాటం సాగించాలని, అలాంటి హక్కు, కాదనే హక్కు, ఏ ప్రభుత్వానికి లేదని సభవారు తమ గట్టి అభిప్రాయాన్ని వెల్లడించారు.

ప్రభుత్వ కార్య కాలపాలలో స్త్రీలకు తగిన స్థానం యివ్వటం గూర్చికూడ యీ సభవారు చర్చించారు, స్త్రీలకు ఓటింగు హక్కులేని దేశాలలో వారికి వెంటనే ఓటింగు హక్కును యివ్వాలని, రాజకీయ రంగాలలో పాల్గొనటానికి తగిన అవకాశాలు కల్పించి ప్రోత్సహించాలని ఆలా ప్రభుత్వకార్య కలాపాలలో స్థానం యివ్వటం స్త్రీలకు సమాన హక్కునివ్వటమే గాక, భావి పౌరనిర్మాణానికి దోహదం యివ్వటం జరుగుతుందని, యీ సభవారు, అభిప్రాయాన్ని వెల్లడించారు.

ఈ సంఘం ఎప్పుడూ వ్యక్తిగత రాజకీయాలకు కట్టుబడి యుండక యు. ఎన్ కార్య క్రమములో సహాయపడుటకు పనిచేస్తూ ప్రపంచ శాంతినిర్మాణానికి భాగస్వామిగా యుండాలని తీర్మానించారు,

ఇవికొద్దిలో చర్చలు, వాటి ఫలితంవల్ల జరిగిన తీర్మానాలు.

30 వ తారీఖున సంఘ సభ అధ్యక్షురాలు, వారి ఆఫీసులో మాకు వీడ్కోలువిందు, నేషనల్ కమ్యూజియములో స్వీడిష్‌దేశ విధానముగా మాకు పాట కచ్చేరి ఏర్పాటు చేసినారు.

తీరికలేని మా సభా కార్య క్రమాలను ముగించుకొని, మాకు అన్నివిధాల సహాయ సానుభూతులను చూపి, మాకు అలాంటి సదావకాశం కల్పించిన ప్రతి ఒక్కరికి, మా కృతజ్ఞతను తెలిపినప్పుడు, స్వీడిష్ లేడిమిసెస్ మరీకర్ కళ్ళనీళ్ళతో "వెళ్ళుతున్నారా" అంటూ పేపర్‌కటర్ నా చేతికిచ్చి ఆప్యాయంగా కౌగలించుకొని "నన్ను మరువరుగా" అన్నది.

వారి సహాయానికి, సామరస్యభావనలకు. ఆశ్చర్యపడుతూ సుందరవంతమైన స్టాక్‌హోమ్ వదలి. కోపెన్‌హేగన్‌కు విమానంలో ప్రయాణమయ్యాము.





స్వాతంత్ర్యం తరువాత సాంకేతిక రంగంలో కూడా—భారత దేశం అమూల్యమైన అభ్యుదయాన్ని సాధించింది. భారతీయ ప్రయోగ కేంద్రాలలో జరుగుతున్న కృషిని ప్రతిబింబించేవే పై చిత్రాలు.

---- నా టి క .

# గ్రామలక్ష్మి

శ్రమదానం చేయడంలో కించపడవలసిన అవసరంలేదనీ, అందుకు దేశములోని యువతీ యువకులు నడుముకట్టాలనీ ప్రబోధించటంతో పాటు,—ప్రతి పల్లెలోను తప్పకవుండే కావమ్మల అపస్వరాలకి స్వస్తిచెప్పడం, లక్ష్మీదేవమ్మల వంటి వారి సహకారాన్ని కూడకట్టడం కూడా అవసరం అని తెలియ చెప్పడమే ఈ నాటిక ముఖ్యోద్దేశం.

దసరా వేడుకల సందర్భంలో మహిళాప్రెస్‌లోని కంపోజిటరు అమ్మాయిలు యీ నాటికను ప్రదర్శించి శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ వంటి ప్రముఖుల మన్ననలని అందుకున్నారని చెప్పడానికి గర్విస్తున్నాం.

—సంపాదకురాలు

(స్టేజి రెండు భాగాలుగా చేస్తూ కర్రస్క్రీను. ఎడమ పక్క వంటగది సామాన్లగది. కుడిపక్క భాగంలో చిన్న బల్ల దానిమీద అద్దం. సూనెసీసా లాంటివి వుంటాయి. ఓ కుర్చీ.

ఎడంపక్క భాగంలో కూర్చుని పాతకాలపు మంగళ హారతి పాడుకుంటూ కూరలు తరుగుతూవుంటుంది లక్ష్మీదేవమ్మ. పెద్ద బొట్టు పాతకాలపు నగలు- సనాతనపు మనిషి.)

లక్ష్మీదేవమ్మ: ఘల్లుఘల్లున పాద గజ్జెలందెలు మ్రోయ కలహంస నడకల కలికి ఎక్కడికే? (లక్ష్మీదేవమ్మ వొదినా అంటూ పిలుపు వినిపిస్తుంది. తలెత్తకుండానే రానో కావమ్మా, రా- అంటుంది లక్ష్మీదేవమ్మ-)

కావమ్మ: (వస్తూనే లక్ష్మీదేవమ్మ దగ్గిరసా కూర్చుంటూ) చూశావుటమ్మా, విన్నావా యీ సోద్దెం! యీకాలం పిల్లలింతేసి రాలు గాయిలయితే, ఏందారి ఒదినా?

ల: (ఆశ్చర్యంగా బుగ్గకి చెయ్యి పోనిచ్చి) అదేవిటే కావమ్మా ఆ గోవిందమ్మ కూతురు సూరిగాని...

కా: అయ్యో నీ తెలివి తెల్లారా! అదికాదే గణపతి గుడి లేదూ-

ల: (గర్వంగా) ఆ మావారేగా దానికి ప్రహారీ గోడ బాగుచేయించారు.

కా: ఆ ఆ అదే ఆగుళ్ళో అరుగులమీద చేరి యీ మాయదారి పిల్లలంతా ఏవేమిటో మాట్లాడుకుంటున్నారుట.

ల: (యింకా ఆశ్చర్యంగా) అలాగనే ఏమిటెటా?

కా: ఏవుందీ, యిదంతా నీకూతురి ఘనతేనమ్మా! సూర్యకాంతం, మీనాక్షి, అంతా కలసి ఏదో సమితిట అయి- యీ వూరి ముఖం మార్చిపారేస్తారుట కుర్రసన్నాసులు!

(దుర్గా యిద్దరు స్నేహితులు ప్రవేశించి పక్కగదిలో కూర్చుంటారు)

ల: ఆఁ మా దుర్గకూడా వుందా! నిజంగానా-

కా: (ధీమాగా) ఆఁ సాక్షాత్తూ అక్కడ కూర్చుని ఒకటే విక వికలూ పక పక

నాటిక.

# గ్రామలక్ష్మి

శ్రమదానం చేయడంలో కించపడవలసిన అవసరంలేదనీ, అందుకు దేశములోని యువతీ యువకులు నడుముకట్టాలనీ ప్రబోధించటంతో పాటు,—ప్రతి పల్లెలోను తప్పకవుండే కావమ్మల అపస్వరాలకి స్వస్తిచెప్పడం, లక్ష్మీదేవమ్మల వంటి వారి సహకారాన్ని కూడకట్టడం కూడా అవసరం అని తెలియ చెప్పడమే ఈ నాటిక ముఖ్యోద్దేశం.

దసరా వేడుకల సందర్భంలో మహిళా ప్రెస్‌లోని కంపోజిటరు అమ్మాయిలు యీ నాటికను ప్రదర్శించి శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ వంటి ప్రముఖుల మన్ననలని అందుకున్నారని చెప్పడానికి గర్విస్తున్నాం.

—సంపాదకురాలు

(స్టేజి రెండు భాగాలుగా చేస్తూ కర్రస్క్రీను. ఎడమ పక్క వంటగది సామాన్లగది. కుడిపక్క భాగంలో చిన్న బల్ల దానిమీద అద్దం. సూనెసీసా లాంటివి వుంటాయి. ఓ కుర్చీ.

ఎడంపక్క భాగంలో కూర్చుని పాతకాలపు మంగళ హారతి పాడుకుంటూ కూరలు తరుగుతూవుంటుంది లక్ష్మీదేవమ్మ, పెద్ద బొట్టు పాతకాలపు నగలు- సనాతనపు మనిషి.)

లక్ష్మీదేవమ్మ: ఘల్లుఘల్లున పాద గజ్జెలందెలు మ్రోయ కలహంస నడకల కలికి ఎక్కడికే?
(లక్ష్మీదేవమ్మ వొదినా అంటూ పిలుపు వినిపిస్తుంది. తలెత్తకుండానే రానో కావమ్మా, రా- అంటుంది లక్ష్మీదేవమ్మ-)

కావమ్మ: (వస్తూనే లక్ష్మీదేవమ్మ దగ్గిరసా కూర్చుంటూ) చూశావుటమ్మా, విన్నావా యీ సోద్యం! యీకాలం పిల్లలింతేసి రాలు గాయిలయితే, ఏందారి ఒదినా?

ల: (ఆశ్చర్యంగా బుగ్గకి చెయ్యి పోనిచ్చి) అదేవిటే కావమ్మా ఆ గోవిందమ్మ కూతురు సూరిగాని...

కా: అయ్యో నీ తెలివి తెల్లారా! అదికాదే గణపతి గుడి లేదూ-

ల: (గర్వంగా) ఆ మావారేగా దానికి ప్రహారీ గోడ బాగుచేయించారు.

కా: ఆ ఆ అదే ఆగుళ్ళో అరుగులమీద చేరి యీ మాయదారి పిల్లలంతా ఏవేమిటో మాట్లాడుకుంటున్నారుట.

ల: (యింకా ఆశ్చర్యంగా) అలాగ ఏమిటేటా?

కా: ఏవుందీ, యిదంతా నీకూతురి ఘనతేనమ్మా! సూర్యకాంతం, మీనాక్షి, అంతా కలసి ఏదో సమితిట అయి- యీ వూరి ముఖం మార్చిపారేస్తారుట కుర్ర సన్నాసులు!

(దుర్గా యిద్దరు స్నేహితులు ప్రవేసించి పక్కగదిలో కూర్చుంటారు)

ల: ఆఁ మా దుర్గకూడా వుందా! నిజంగానా-

కా: (ధీమాగా) ఆఁ సాక్షాత్తూ అక్కడ కూర్చుని ఒకటే వికవికలూ పకపక

లూనూ-కావలిస్తే ఆ గోవిందమ్మని వాకబు చెయ్యి; యింకా ఏమను కుంటున్నారో తెలునా?ఆ రామారావు లేడూ?

ల: (కోపంగా) చాల్చాలు!. వాకబెందుకే వాకబుట! రానీ చెప్తాను. యిదిగో యీ బెండకాయలల్లే ముదరబెడితే యిట్టాగే తయారౌతారు- నేనెత్తి మొత్తుకున్నా వింటేగా? హుఁ

కా: మగాళ్ళననేదేముందే నువ్వు చూడాలి గాని అయినా ఆడపిల్లలిలా బరి తెగిస్తే చెడి పోరుటమ్మా.

(ఈ మాటలు పక్కగదిలో దుర్గా, స్నేహితులూ విని నవ్వుకుంటారు. అది విని ఒక్క ఉదుటున కావమ్మ లేచి నిల్చుంటుంది.) ఎవరే పక్క గదిలో అలుకుడూ?

ల: (ఆశ్చర్యంగానే) ఎవరూలేరు- దుర్గొచ్చిం దేమిటి చెప్మా! అయినా భయమెందుకే? యీ పిల్లలకి బుద్ధి చెప్పాలిగాని.

కా: వస్తా వదినా మళ్ళీ వస్తా... (నిష్క్రమిస్తుంది.)

(కూరబు కోపంగా తరుగుతూ దుర్గా ఓ దుర్గమ్మ తల్లీ అని కేక వేస్తుంది.

(పక్కగదిలోంచి ఒక్క పరుగున పోయి చుట్టు తిరిగి వంటింట్లోకి వస్తుంది. అమాయికంగా ముఖం పెట్టుకుని దుర్గ.)

ల: (తలెత్తకుండానే) ఎంతసేపయిందే వచ్చీ?

దుర్గ: చాలాసేపయిందే అమ్మా, ఎందుకూ బెండకాయలన్నీ తరిగేస్తున్నావు?

ల: అఘోరించడానికి, నేనెలా ఛస్తే నీకెందుకే నామాటేమైనా లెక్కంటేగా,

దు: అమ్మా, ఆ కావమ్మ మాటలు పట్టుకుని నివ్విలా యిదై పోతే ఎలాగే—

ల: (కోపంగా) అయితే ఆ గణపతి గుడి అరుగుమీద చేరి మీరు చేస్తున్న గూడు పుఠాణీ ఏమిటే- తెలియకడుగుతాను కానీ,

దు: (చిన్నగా నవ్వుతూ) అమ్మా చెప్పేద్దును గానీ..

ల: అఘోరించలేకపోయావే! పెళ్ళీడు పిల్లవి-నా గొంతు చించుకోవడం నాదేకాని యీ గోల ఎవరుపట్టించుకుంటారీ కొంపలో!... అయినా ఏంగోజులోనమ్మా, నీ యీడుకి నాకు పెళ్ళయి నాలుగేళ్ళయింది!... ఎమిటే యీ తిరుగుళ్ళు? సభలంటావు సమితులం టావు? నాకేం అర్థంకాకుండావుందే! ఎవరైనా ఏమనుకుంటారే! యిక మంచి సంబంధం ఎలావస్తుందే!

దు: ఎవరమ్మా అనుకునేది- ఎదురింటి సుందరమ్మా పక్కింటి గోవిందమ్మా! అంతేగా (హేళనగా) చూడు లక్ష్మీదేవమ్మ వొదినా దుర్గనలా వొదిలేస్తే ఎలా! (అంటూ బుగ్గలు నొక్కుకుంటుంది నవ్వుతుంది.) అమ్మా నీకు తెలియదు. పోనీ అని చెప్తే వినవు. అదే ఒచ్చింది చిక్కు. ఒక్క నాలుగు రోజులు ఓపిక పట్టు. అంతా నీకే తెలుస్తుంది. నే హాల్లో కూర్చుంటాను.

(లేచి లోపలికి వెళ్ళిపోతుంది.)

ల: (ఎదురుగుండా చూస్తూ) ఏంరోజులో నమ్మా, మారోజుల్లో యిలాగా? బుగ్గలు నొక్కుకుంటుండగా తెర

♦ ♦ ♦

(హాలు. రెండు కుర్చీలూ ఓ చాప చిన్న బల్ల వార్తా పత్రికలు. యువకుడొకడు కూర్చుని పేపరు చదువుకుంటూవుంటాడు. పల్లెపదం పాడుకుంటూ దుర్గ విసురుకుంటూ లోపలికి వస్తుంది.)

వేణు: (అవుని అన్నట్లు) హేయ్.... హేయ్ ఆగాగు ఏమిటా జోరు.

దు: ఓరిసీ, యిక్కడా వున్నావు నయం యింకా గాజులూ అవీ తొడిగించుకోలేదు.

వే: (పేపరు కింద పెట్టేస్తూ) అంత అవసరం రాలేదు వూరుకున్నానోయ్- చూడు ఏమిటా జోరు! ఆ రామారావుగాని కళ్ళకి కనపడలేదు గదా?

దు: (వేళాకోళంగా) నీ ముఖమోయ్ పుల్లాయ్— అమ్మాయిలం అంతా కలిసి వూరిలోని దిగుడు భావి బాగుచేయడానికి సన్నాహాలు చేస్తున్నాం. ఒరేయ్ అన్నాయ్ కొందర్ని నువ్వూ కూడగట్టరా చక చక పని సాగిపోతుంది-

వే: (ఆశ్చర్యంగా) మీరా! తట్టా బుట్టా పట్టి నుయ్యి బాగుచేస్తారా?

దు: (పమిటచెంగు నడుముకి చుట్టుతూ) ఏమిటోయ్ మహా!

వే: అయితే పదండి దుర్గా, నేనూ రామాన్ని శేషుగాణ్ణీ యింకా అందర్ని పోగుచేస్తాను. పని కానిద్దాం. విజయదశిమినాడు ఓ పెద్ద ముత్తయిదుచేత దిష్టి తీయించేద్దాం.

దు: (గర్వంగా) ఆ ప్లానంగా నేవేశానురా, ఈదెబ్బతో అమ్మ చూడు!

అదుగో నాన్నగారూ వచ్చేశారు- నాన్న గారూ...

రామనాథం: ఏంతల్లీ చాలా పెద్ద ప్లాను వేశావుట. పంచాయితి వాళ్ళు చెప్పుకుంటున్నారు- (నవ్వుతాడు)

దు: (సరదాగా) అయితే నీదాకా వచ్చిందా నాన్నా—

రామ: (నవ్వుతూ) ఆఁ ఆ— కావమ్మనోట్లో పడ్డాక! యిక్కడిక్కడదోలెక్కా! ఢిల్లీ దాకా వెళ్ళిపోతుందిగదే! రండి భోజనాలు చేద్దాం.

(ఇంతట్లో లక్ష్మీదేవమ్మ వస్తుంది.)

ల: వచ్చారా లేవండి భోజనాలకి. ఏవండీ ఈ దుర్గమ్మతల్లికింకెలా పెళ్ళి!

రామ: అదా నీ బెంగ, పిచ్చిదాన, దానికేమే ఏవడైనా కళ్ళకద్దుకుని పెళ్ళాడుతాడు గాదే!... లక్ష్మీ మీ కావమ్మలేదూ?

ల: మధ్యని నా కావమ్మేమిటీ! నవ్విపోతారు! లెండి... (లోపలికి దారి తీస్తుంది.)

దు: (తండ్రిదగ్గరకి వచ్చి రహస్యంగా ఆ గణపతి గుడిలో దిగుడు భావి బాగుచేయడం మొదలుపెట్టాం నాన్నా. అమ్మకది తెలిసి కేకలేసింది. ఈ కోపం పోవడానికీ మా పని నచ్చడానికీ ఓ చిన్న చిట్కా చెప్తుదూ?

రామ: యిలారా (దగ్గరసాపిలిచి చెవిలోఏదో చెప్పాడు. ఒక్క చిటిక వేసి ఉత్సాహంతో లోపలికి వెళ్ళిపోతుంది దుర్గ.)

రామ: పిచ్చితల్లి! (అంటూండగా తెరపడుతుంది)

♦ ♦ ♦

(స్టేజి కొంచెం చీకటిగా వుంటుంది. హాల్లో వాలు కుర్చీలో రామనాథం కూర్చునివుంటాడు. తమల పాకులు రాసి యిస్తూవుంటుంది లక్ష్మీదేవమ్మ.)

ల: ఏవండీ ఇంత ఇల్లు పట్టకుండా ఆడపిల్ల తిరగటం మీకెలా బావుందండీ? లోకులంతా అవ్వ! అని నోరు నొక్కుకుంటున్నారు!

రామ: (నవ్వుతూ) నీపిచ్చిగాని ,లక్ష్మీ ఒక్క ఆడపిల్ల యింత నిర్మాణాత్మకంగా పని చేయించటం చూసి ఓహో అనుకుంటున్నారు.

ల: (బాధగా) తల్లిబాధ మీకెలా తెలుస్తుంది? ఒక్కగానొక్క ఆడపిల్ల. యిలా తిరిగితే సంబంధాలు వస్తాయా? నేనెంత చెవి నిల్లు కట్టుకు పోరినా నాగోడనెవరిక్కావాలి? ఈ కొంపకి పెద్దా మొద్దా అన్నీ నేనే-(ఏడుస్తుంది. కొంగు చాటున ముఖం పెట్టుకుని.)

రామ: (నవ్వుతూనే) ఓయ్ యిలా వెర్రి బాగులదానిలా అయితే ఎలా? చూడు దుర్గేం తెలివితక్కువదనా? యిన్నాళ్ళు పంచాయితీవాళ్ళు కూడబలుక్కుని చేయ లేని పనిని పది రోజుల్లో చేసేశారు. అక్కడంతా పచ్చతోరణాలు కట్టారు. ముగ్గులు పెట్టారు. చూడ పండువగా వుంది... కొద్ది రోజులాగు; దుర్గని చూసి దుర్గ సాధించినది చూసి నీ మాతృ హృదయం గర్వంతో పులకరిస్తుంది... అమ్మో మాటల్లోనే వస్తూంది... ఏందుర్గా అన్నాయేడీ?

దు: (తల నవిరించుకుంటూ) కొంచెంసేపవుతుంది నాన్నా వాడు రావడానికి.

ల: (కోపంగా) ఏమిటే అవతారం? ఏ పెళ్ళికొడుకేనా యీ క్షణంలో చూడాలి! రామ! రామ!

(తండ్రీ కూతురు నవ్వుకుంటారు. లక్ష్మీదేవమ్మ కోపంగా లోపలికి వెళ్ళిపోతుంది)

దు: ఎందుకు నాన్నా అమ్మకంత కోపం?

రామ: ఏదో పూర్వకాలం మనిషి. మారే కాలంతో పాటు మనం మారిపోతే ఏం ప్రమాదమో అని భయం.

దు: పుట్టి పెరిగిన గడ్డ యిది. దీని సేవలో కించపడ్డం ఏముంది నాన్నా? పట్నం చదువులు చదువుతే యివేం పన్లు అంటుంది!

ల: (వస్తూ) ఈ ధర్మపన్నాలు నాదగ్గరా మీ నాన్నదగ్గిరా కాదు, ఆ కట్టుకోబోయేవాడి దగ్గర వల్లించు!

(సిగ్గుతో తల వంచుకు లోపలికి పోతుంది దుర్గ)

ల: ఏమైనా సరే, ఈ వచ్చే రెండ్నెల్లలో దానికా మూడు ముళ్ళూ వేయించి తీరాలండీ...

రామ: (సాదరంగా లక్ష్మీవైపు చూస్తూ) నువ్వూ వయస్సులో ఎంత ఉత్సాహంగా వుండేదానివో జ్ఞాపకం తెచ్చుకో లక్ష్మీ.

ల: (సిగ్గుపడుతూనే) హు మా రోజుల్లో యిలాగా? కలవారింటి పడుచు పురమాయించి పనులు చేయించుకుంటుంది. కాలు మీద కాలేసుకు కూర్చుంటుంది. యిలా పాలేళ్లలాగా కూలేళ్లలాగానా! అవ్వ!

రామ: నీకు తెలియదు లక్ష్మీ. మన పని మనం చేసుకోవడం తప్పులేదుగా? అలాగే మన వూరి పని!

ల: చాల్చాలు యిక లేవండి, మీ సుపుత్రుడు యింకా వచ్చినట్టు లేదు కొంపకి. [తెర]

♦ ♦ ♦

(వేణు డాన్సు డ్రెస్సులో రడీగా వుంటాడు. రామారావు వస్తాడు.)

వే: రారా ఏమటా ఆముదం ముఖం?

రామారావు: ఒకేయ్ వేణూ నేను రావడం లేదురా, చెప్పిపోదామని వచ్చాను.

వే: అయితే దుర్గని పిలుస్తానుండు. దుర్గా (పిలవబోతూవుంటే నోరు మూసేస్తాడు రామారావు.)

వే: (నవ్వుతూ) ఎందుకురా అదంటే అంత భయం!

రామా: భయం కాదురా భక్తి!

వే: చచ్చాంఫో, అయితే శఠగోపం పెట్టించుకు వెళ్ళు; పిలవనా?

రామా: వద్దురాబాబూ శఠగోపం ఎప్పుడో పెట్టేసింది. నీ వేషమేమిటిరా?

వే: ఈవాళ దిగుడు బావికి ప్రారంభోత్సవం మదీయంబగు అమ్మ— అంటే మా అమ్మ గ్రామలక్ష్మి— చిన్నలని ప్రోత్సహించి వస్తుంది. ఊరంతా ఓహో అనాలన్నమాట! ఏరా నువ్వు రాకుంటే తప్పకుండా దుర్గకి చెప్పేస్తాను. చెప్పడం ఎందుకూ పిలిచేస్తాను.

యూనా?

వే : (రామారావు బుజం తడుతూ) -అమ్మ అమాంతం ఒప్పేసుకుంది.

రామా : (ఆత్రంగా) ఏమనీ?

వే : దుర్గకిక రెండ్నెల్లల్లో ఎలాగైనా ముహు ముళ్ళూ వేయించి తీరతానని! మరేం భయ పడకోయ్.

(లోపలినుంచి అన్నాయ్ కేక)

రామా : (హడావిడిగా) పోతారా, వస్తాలే-- నన్ను మాటుకు మరిచిపోకు—

(ఇద్దరూ నవ్వుతూండగా తెర )

♦ ♦ ♦

(దుర్గ స్నేహితులు బాగా అలంకరించుకుని వుంటారు. ఒక పళ్లెంలో పళ్ళూ తాంబూలం అన్నీ పెట్టి అలా గుస గుసల్లోనే మాట్లాడుకుంటూ వుంటారు. పువ్వులు కడుతూ చక్కని పల్లెపదం పాడుతూవుంటారు. పక్కనుంచి తొంగిచూసి లక్ష్మీదేవమ్మ లోపలికి పోతుంది.)

దు : చూచిందా? సరే ఓసారి ఆడి చూసు కుందాం. అబ్బాయిగారు కూడా రడీయేగా!

(నృత్యగీతం)

స్నే : యింకా అలస్యం ఎందుకూ అక్కడంతా ఎదురుచూస్తూవుంటారు. త్వరగా వెడదాం. నాన్న అన్నయ్య వస్తామన్నారే! సరే సరే రండి పిలవండి,

దు : ముందు అమ్మని మచ్చిక చేసుకోవద్దూ (నవ్వుకుంటారు)

అమ్మా ఓ అమ్మా.

ల : (లోపలినుంచి) ఆ, ఎందుకే ఆ గావు కేకలూ (వస్తుంది.)

కుండా వుంటే చక్కగా అన్నీ చెపుతాను. (గోముగా అంటుంది)

ల : కోపమెందుకే నా చిట్టితల్లీ, ఏదో పూర్వ కాలపుదాన్ని యివన్నీ యెబ్బెట్టుగా వుంటా యంతే.

(దుర్గా స్నేహితులూ ఒకరి ముఖాలొకరు చూసు కుంటారు )

దు : అదికాదమ్మా ఇవాళ మేం తలపెట్టిన పని పూర్తి అయింది. పెద్దదానివి, నీ చేతి చలవగా పది కాలాలు అంతా వాడు కోవాలి— ఆ నూతి నీరు. నువ్వూ వచ్చి అక్కడ దిష్టి అదీ తీసి మా పండుగలో పాలు పంచుకోవాలి.

ల : (ఆశ్చర్యంగా) ఇదంతా చెప్పలేదే మీా నాన్నగారు,

దు : (నవ్వుతూ) అయితే కొంత చెప్పారన్న మాట ముఖ్యంగా చెప్పొద్దని చెప్పాను!

ల : పోయిందేముందే, యిప్పటికేనా మీారు చేస్తున్న పని దాని ఘనతా అర్థమయింది.

దు : (తల్లిని కౌగలించుకుంటూ) అమ్మా, అందుకేనమ్మా యిప్పుడు నిన్ను గ్రామ లక్ష్మిని చేస్తున్నాం. నూతిదగ్గర ప్రసిడెంటు గారి భార్యదగ్గిర్నుంచి అంతా వున్నారు. మనం వెళదామా?

(తండ్రి వస్తూనే)

రామ : పద లక్ష్మీ, యింకా దేనికి ఆలోచన నేచెప్పలేదూ నీకూతురు నీకు గర్వకారణం అవుతుందని—

ల : (దుర్గ తల నిమురుతూ) నడవండి తల్లీ వస్తున్నాను నడవండి.

రామ : అమ్మా దుర్గా వూరు వూరంతా తోరణాలు కట్టారు. అలంకరించారు.

# స్తబ్ధతను మానుమోయీ!

కె. సీతాదేవి

స్తబ్ధతను మానుమోయీ- తమ్ముడా
స్తబ్ధతను మానుమోయీ-
నీరవత ఎందులకు నిశ్శబ్దమెందులకు?
ఎందులకు నీకింత నిర్లిప్తతా

నీచుట్టునున్నదంతా శక్తిమయము,
నీ పరిసరాలనున్నదంతా కాంతిమయము.

నిన్ను సుంతయిన కదిలింపలేదా
ఏల యీ యోచనా ఏలయీబద్ధకము
కాలమిట్లే ఎంతో గడచిపోవును సుమీ!
నీవు పట్టినదేదో మహాత్కార్యసిద్ధికై
యని యెంచుకొని నీవు ఉత్తేజమందుమా

ఏపనితోయైనను మీనమేషాలన్నీ
లెక్కించుటమాని అభ్యుదయ పథమును
అనుసరించుము తమ్ముడా!
స్తబ్ధతను మానుమోయి!

అచలమనుకొన్న మన యాధారమగు భూమి
అనవతరమును ఆగకెటుల నడుస్తూంది?
అటులనే ఎనెన్నో ఆకాశపథమున
అధారమును కూడలేనివై శక్తిచే
ఆకర్షవంతమై యాగకనె ఎప్పుడూ!
అలసటను పొందకా అతివేగమందుచు
శూన్యపదమునగూడ చుట్టుచును వున్నయవి.
అదిచూసినడుచుకోమ్మా తమ్ముడా!
స్తబ్ధతను మానుమోయీ!...

నిండు హృదయముతోడ నీవు నడచిన దారి
కంటక మయంబైన కాంతిహీనంబైన
బాధించు మృగములభీతిగల్గిన గూడ
ఘోరదుర్గమంబైన కారుచీకటియైన
జడివానలోయైన, వడగాడుపులనైన
శక్తియే నీ మనోనిశ్చయమె యూతగా
ముందునకు సాగిపొమ్మా- తమ్ముడా—

స్తబ్ధతను మానుమోయీ!
దారిలో నీవెన్నో సత్కార్యములు సల్పు
దారితప్పిన పిల్లలు. దీనులగు వృద్ధులు
వారినొక కంటితో పరికించి మరిపొమ్ము.
నీలోనఉన్నయది నిదురబోయేశక్తి

నినుమేలు కొల్పెదను నామాటచేత,
అక్క ఆదేశము. ఆశీర్వచనము
ఆత్మబలమునొసగు నీకన్నివేళలను
ఆశక్తియూతయే యాధారముగ గొని

అడుగు ముందుకు వేసి ఆదర్శమందుమా
స్తబ్ధతను మానుమోయీ- తమ్ముడా—



# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తికలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంటే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు!




AL-87-1 TELUGU

# రాగ సంగమం

కథానిక

శ్రీ ఎ. ఎస్. రామారావు

"నీకు చాకిరీ చేస్తూ కూర్చోటానికి నేను తీరిగ్గా కూర్చున్నాననుకున్నావా? అందరికీ అన్ని వేళకు అందించటానికి నాకేం పది చేతులున్నాయనా? ఈ ఇంట్లో అంతాతిని తిరుగుతూ అధికారం చెలాయించే వాళ్లే వెళ్తే బడికి వెళ్లు; లేకపోతే నువ్వూ ఒక పుస్తకం పట్టుకు ఒక కుర్చీ చూసుకు కూర్చో. అంతే కాని నా కొంగు పట్టుకు తిరక్కు. తెల్సిందా?" సుందరమ్మ కూతురు లలితను పట్టుకుని నాలుగు నోటికి అచ్చినట్లు తిట్టింది.

వదినె అంటున్న మాటలు అన్నయ్య గది తుడుస్తూన్న మాలతి చెవుల్లో చాలా ఘాటుగా పడ్డాయి. మాలతి ఒక్కసారి అదోలా అయిపోయింది.

"నిజానికి ఈ ఇంట్లో ఎందరున్నారని? అన్నయ్య, వదిన, లలిత ఇక మిగిలిందల్లా తనొక్కతేకదా! ఈ ఇంట్లో వదిన దృష్టిలో తనొక్కతే కదా పరాయిది. పిల్లిమీద, కాకిమీదపెట్టి ఏవేవో అనకపోతే, ఎదురుగావున్న తననే ఆ అనాల్సినదేవో అనకూడదూ? రోజూ చూస్తూనే వున్నది. ఏదో చిన్న విషయాన్ని తీసుకునా ఎంతో రాద్ధాంతం చేస్తోంది." అనుకుంది తనలో మాలతి. ఆమె లేత హృదయం గాయపడింది. తన బ్రతుకింత వేగంగా తెల్లారినందుకు లోలోపలే కుమిలి కుమిలి ఏడ్చింది. అంతకంటె ఏం చెయ్యగలదు?

"చూడత్తయ్యా! జడ వెయ్యమంటూంటే అమ్మ వెయ్యటంలేదు. బడికి టైం అయిపోతూంటేనూ, నువ్వేద్దూ; తొందరగా బడికి పోవాలి." అంటూ ముద్దు మాటలతో చిన్న చిన్న అడుగులు వేసుకుంటూ నూనె సీసా, దువ్వెన పట్టుకువచ్చింది లలిత. లలితను చూసేసరికి మాలతి హృదయంలో ఏదో బాధ, సంతృప్తి, ఆవేదనవంటి భావనలు ఒకదాని వెంట మరొకటి వలయాకృతిలో పరిభ్రమించేయి. అనుకోకుండా ఆమె కళ్లల్లో నీళ్లు చేరి నునుపైన లేత చెక్కిళ్లమీదుగా ధారకట్టేయి.

లలిత రాగానే ఆమెకు కనిపించకుండా కళ్లు తుడుచుకుని చీపురు గోడమూలను పెట్టింది. పెల్లుబికి వస్తూన్న దుఃఖాన్ని బయటకు రానీయకుండా అణచుకుంది.

"అవును లలితా! అస్తమానం అమ్మనే జడ వెయ్యమనకపోతే నా దగ్గరకు రాకూడదూ? అమ్మ పనిచేసుకుంటూంటే అమ్మనే అడగాలా? నువ్వు మరీ అల్లరి పిల్లవై పోతున్నావుసుమా! నాన్న రానీ చెప్తాను నీ పని!" అంటూ చిరుకోపాన్ని, లాలిత్యాన్ని మిళాయిస్తూ లలితకు జడ వెయ్యడానికి కూర్చుంది మాలతి.

మాలతి ఇంకా జడవెయ్యటానికి కూర్చుందో లేదో! వంటింట్లోంచి సుందరమ్మ గబగబా వచ్చి మాలతి ముందర కూర్చున్న లలితను ఒక్కవూపున ఈడ్చేసింది. వదినె చేష్టలు అర్థంకాక మాలతి బిత్తరపడి వదినె ముఖంలోకి చూస్తూకూర్చుండిపోయింది లలిత తలకు నూనె రాద్దామని చేతిలో వేసుకున్న నూనె ఆమెకు తెలియకుండానే నేల జారిపోయింది.

"ఓసిముదనష్టపు ముండా! నన్నీ ఇంట్లో వుండనివ్వకుండా చెయ్యాలని చూస్తూన్నావటే! మహా రోజు వేళకు బడికి పోతూన్నట్లు! ఇవ్వాళేం తొంద రొచ్చిందే నన్ను చంపి రంపాన పెడుతున్నావే? మీ నాన్న చూస్తే ఇంకేమైనా వుందా? నీ బ్రతుకూ, నాబతుకూ ఇవాళతో నేసరి." అంటూ లలిత వెన్నుపై నాలుగు చరిచింది. సుందరమ్మ "మందరమ్మ" అవతారం ఎత్తింది.

అమ్మ పెట్టిన నాలుగూ అరగించటంతో లలిత రాగాలాపన మంద్రస్థాయినుండి, తారస్థాయి నందుకుంది. ఏడుస్తున్నకొద్దీ సుందరమ్మ దెబ్బలు హెచ్చుతున్నాయే

కాని, తగ్గు ముఖం పట్టటం లేదు. సుందరమ్మ వాల కాన్ని చూసి మాలతి మరి సహించలేకపోయింది.

"అదేమిటి వదినా? చిన్న పిల్లను అలా కొడతా వెందుకూ? ఏం చేసిందని? నీకు చెయ్యి తీరిక లేకపోతే జడ వెయ్యమని నా దగ్గరకు రాకూడదా? ఈ మాత్రానికే ఇంత గొడవా? అలా కొడితే బ్రతుకుతుందా? చస్తుందా?" అంటూ లలితను తీసుకోబోయింది.

"మహా చెప్పొచ్చేవులే తగుమనమ్మా అని: నా పిల్లను నేను కొట్టుకుంటాను, చంపుకుంటాను. నీ కెందుకూ మధ్యన? నేనేం చేసినా అందరికీ గొడవలానే వుంటుంది" సణక్కుంటూ లలితను మరోటి చరిచింది.

తనమీద గల పగనీ, ద్వేషాన్నీ లలితమీద ప్రయోగిస్తున్నందుకు మాలతి హృదయం గాయపడింది. సుందరమ్మ మాటలు మాలతికి కోపాన్నేకాక "ఇవ్వాళ ఏదో ఒకటి తేల్చేయ్యాల" నిపించేటట్టు చేసింది. ఎన్ని జరుగుతున్నా; ఎంతెంత మాటలంటూన్నా ఇన్నాళ్లవరకూ సహించింది. మనిషై పుట్టినతరువాత ఏపని చేసినా సహనానికి ఒక హద్దంటూవుంటుంది. అది కూడా దాటితే ఎంతటి మహాత్ముడైనా ఏదో ఒక దారి వెదుక్కోవల్సివుంటుంది.

"నేనిక్కడ వున్నన్నాళ్లూ లలితను కొట్టటానికి వీల్లేదు. ఆ తరువాత చంపుకుంటావో. ఏం చేసుకుంటావో?" కోపంలో శాసించినట్టుగానే అంది మాలతి.

"ఆ మాటకూడా అన్నావూ? మహాతల్లే! ఇన్నాళ్లూ ఆయనొక్కరే నామీద అధికారం చెలాయించేవాళ్లను కున్నాను. ఇప్పుడు తమరొక్కరన్నమాట! నా ఇంట్లో నావాళ్లను నా ఇష్టమొచ్చినట్లు అంటాను అడిస్తాను. మధ్య పైవాళ్ల సాధింపు లేమిటో!" చేతులు తిప్పుతూ, మూతి విరుస్తూ అంది సుందరమ్మ.

"నేనిక్కడే మీ అధికారాలు చెలాయించటానికి రాలేదు. నా కర్మ ఇలా వుండబట్టి, అన్నయ్య పట్టుబట్టి తీసుకురాబట్టి వచ్చేను. లేకపోతే ఇక్కడకు రావటానికి నాకేం అవసరంలేదు. తిండికి నాకేం గతికడుక్కుపోలేదు. ఆ మాత్రం పోషించటానికి నాన్నవున్నాడు." కోపంగానే అంది మాలతి.

"దేనికైనా పెట్టి పుట్టొద్దటమ్మా! నాలుగు కాలాలపాటు హాయిగా బ్రతికే రాత వుండొద్దూ? ఇక్కడున్నా, ఎక్కడున్నా పుట్టింటనే గాదటో?" సూటిగా కటువుగా అంది సుందరమ్మ.

ఆడదానికి జన్మతః వుండాల్సిన జాలిగుండె ఆమెలో అదృశ్యమైంది. కటువైన మాటల్ని గాయపడిన హృదయంపై కారం జల్లినట్టుగా ప్రయోగించింది. అలాంటి మాటల్తో ఒక లేత హృదయం, అమాయక, నిస్సహాయ జీవి ఎంత బాధ పడుతుందోననే ఇంగిత జ్ఞానమైనా కలుగలేదు సుందరమ్మకు. నిండు జీవితంలో పెను తుపాను తాకిడికి తట్టుకోలేని పసి హృదయం ఎంతగా దహించుకుపోతోందో నన్న ఆలోచనైనా కలుగలేదు. ఎండి, మోడువారిన, యౌవ్వన జీవితంలో తిరిగి పచ్చదనాన్ని సృష్టించటానికి సహాయపడటం మాని, గొడ్డలి వేటు వెయ్యటానికి సిద్ధపడింది సుందరమ్మ గుండె,

సుందరమ్మ మాటలు మాలతికి శూలాల్లా తగిలేయి. మాలతి హృదయం దుఃఖంతో నిండి బరువెక్కిపోయింది. కళ్లనిండా నీళ్లు చేరి నునుపైన చెక్కిళ్లమీద నుంచి వక్షం మిద ధారలుగా పడుతున్నాయి. ఆ సమయంలో సుందరమ్మను ఎదిరించినా ఫలితం ఏమీ వుండదనే నిశ్చయం మాలతికి కల్గింది. "ఎంతైనా అన్నయ్య తనవాడే. తననీ తన జీవితాన్ని చూసి చింతిస్తాడు. ఏదోలా సహాయం చెయ్యాలని ఉబలాటపడతాడు కాని, వదినెలో ఈ భావం వుండదుకదా!" అనుకుంది. ముఖానికి పైట అడ్డుగా పెట్టుకుని కుమిలి కుమిలి ఏడ్చింది.

"జీవిత మాధుర్యాన్ని చవిచూడకుండా ఇంత తొందర్లోనే తన పసుపు, కుంకుమ చెరిగిపోతా యనుకోలేదెవ్వరూ. తన బ్రతుక్కి ఎంతో బాధపడింది. చావలేక బ్రతుకుతున్న తనని మళ్లీ ఒక మనిషిగా చేద్దామనుకుంటున్న అన్నయ్య అంతగా నాన్నతో చెప్పకపోతే తనిక్కడికి రావల్సివుండేదికాదు. ఆ మాత్రం, తిండి బట్టా, ఇవ్వటానికి నాన్నకేం లేకపోలేదు. తనపై తన వాళ్లకుండే జాలి, అభిమానమూ, పరాయివాళ్ల కెక్కణ్ణుంచొస్తుంది?" అనుకుంది తనలో మాలతి. ఆమె కిక అక్కడ వుండాలనిపించలేదు. తండ్రిదగ్గరకు వెళ్లిపోవాలని నిశ్చయించుకుంది.

అప్పుడే బజార్నుంచి వచ్చి గుమ్మంలో అడుగుపెట్టిన ఆనందరావుకి ఇల్లంతా నిశ్శబ్దంగా, వికృతంగా కనిపించటంతో కతలచెందేడు. మళ్లీ ఇంట్లో ఏదో గొడవ జరిగి వుంటుందనుకున్నాడు. మెల్లగా ఇంట్లో అడుగుపెట్టేడు. సుందరమ్మ కాని, మాలతికాని అతని దృష్టికెక్కడా కనిపించలేదు. వంటింట్లోకి వెళ్లేసరికి, సుందరమ్మ ఏదో మూలుక్కుంటూ అన్నం వారుస్తోంది. ఏం మాట్లాడకుంటా సంచీ పడేసి గదిలోకి వచ్చేడు ఆనందరావు.

మాలతిని చూసి కొద్ది క్షణాలు నిశ్చేష్టుడై నిల్చుండి పోయేడు. ఆనందరావు నోట మాట రాలేదు. అతనికి మాలతి మనసు చిన్ననాటినుండి తెల్సు. ఆమెలో జాలి, అభిమానం, ఓర్పు మొదలైనవి ముద్దకట్టుకు కూర్చు న్నాయి. ఎంతో విపత్కర పరిస్థితి ఏర్పడితే కాని ఆమె లోని సహనం సడలదు. ఏడ్చి ఏడ్చి ఆమె కళ్లు ఎర్రనై పోయాయి. చెక్కిళ్లమీద కన్నీటి చారలు ఇంకా అలానే వున్నాయి. మాలతి తన పెట్టెలో బట్టలు సర్దుకుంటూంటే లలిత ప్రక్కన నిల్చుని అమాయకంగా చూస్తూవున్నాడు. ఎడారి జీవితమైపోయిన ఒక్కగా నొక్క చెల్లెలు జీవి తాన్ని తిరిగి పచ్చని మాగాణిగా చేద్దామనే ఆశతో తీసుకు వచ్చిన తను ఆమెను మరింత క్రూరంగా హింసిస్తున్నా నేమోనని బాధపడ్డాడు. భార్యమీద ఎక్కడలేని కోపం వచ్చింది ఆనందరావుకు. ఆ సమయంలో ఏం చేయడాని కైనా సమర్థుడే. కాని, ముందు వెనుకలు ఆలోచించి, పరిస్థితుల్ని చక్కబెట్టటం ఆనందరావుకి బాగా తెల్సి వుండటంచేత, ఆ పరిస్థితిలో తను జోక్యం కల్గించుకో కూడదనుకున్నాడు.

"ఎక్కడికి మాలతీ ప్రయాణం?" జవాబు తెల్సివుండే ప్రశ్నించేడు.

"నాన్న దగ్గరకి అన్నయ్యా!" క్లుప్తంగానే సమాధానం ఇచ్చింది మాలతి. గొంతు బొంగురుపోయింది.

"ఇప్పుడు వెళ్లి ఏంచేద్దామని? కొన్నాళ్లయ్యేక వెళ్దువు గానిలే!" మాలతి తన నిశ్చయాన్ని మార్చుకోదని తెల్సే అన్నాడు ఆనందరావు.

"నాన్నను చూసి చాలా రోజులైంది. చూడాలని అదోలావుంది. ఒక్కసారి వెళ్లి చూసొస్తాను." తన నిశ్చయాన్ని వ్యక్తంచేస్తూ అంది మాలతి.

ఆనందరావుకు తెల్సు మాలతి ఆలా అంటుందని. మరొకరికి కష్టం కలిగించే విధంగా ఆమె ఇంతవర కెన్నడూ ప్రవర్తించలేదు. మాలతి తన ఇంటికి వచ్చిన దగ్గరనుంచీ, తన భార్య మాలతిమీద చూపిస్తూన్న అభి మానాన్ని; అపేక్షనీ ఒక కంట కనిపెడుతునేవున్నాడు. అంచేత అతనికి ఏనాటినుంచో తెల్సు. "ఒకనాడు తిరిగి తండ్రిదగ్గరకు వెళ్లిపోతుందని" అందుకనే అత నంతకంటే ఎక్కువగా ప్రశ్నించలేదు.

"అన్నయ్యా! బస్సుకి టైం అయింది బండి తీసుకు వస్తావా?" అడిగింది మాలతి.

"ఇప్పుడేవింటి? భోజనంచేసి రెండో బస్సుకి వెళ్దువు గానిలే. అలా నిన్ను దిగబెట్టి, నేను ఆఫీసుకు వెళ్తాను." అన్నాడు ఆనందరావు.

మాలతి మరేం మాట్లాడలేదు. ఆనందరావు స్నానాని కని పెరట్లోకి వెళ్లిపోయేడు. సుందరమ్మ తన ఎత్తులు ఇన్నాళ్లకు బాగా పనిచేసి ఫలించినందుకు తనలో తనే మురిసిపోయింది. అత్తయ్య ఊరికి వెళ్లిపోతున్నదని లలిత మనస్సు పసిగట్టేసింది. ముఖం వెలవెలపోయింది.

భోజనాలవుతున్నంతసేపూ అక్కడ వారిమధ్య మౌనం ఆవరించుకొనివుంది. ఆ యింట్లో అప్పుడప్పుడలాంటి పరిస్థితు లేర్పడినా, ఇప్పుడు మాత్రం ఒక పరిణామా న్నందుకుంది.

భోజనాలవగానే బండి తీసుకువచ్చేడు. మాలతి వదినతో వెళ్లివస్తానని చెప్పింది. సుందరమ్మ నోట మాట రాలేదు. లలితను తనివితీరా ముద్దుపెట్టుకుంది. మాలతి. అత్తయ్య వెళ్లిపోతూంటే లలిత ముఖం వెల వెల పోయి, అదోలా చూస్తూ నిల్చుంది. ఆమె కళ్లల్లో నీళ్లు నిండేయి. తెలిసీ తెలియని జ్ఞానంలో అత్తయ్య ఎందుకు వెళ్లిపోతోందో ఆమెకు తెల్సు. పసి హృదయం దుఃఖంతో నిండిపోయింది. ఒక్కసారిగా ఏడవాలని పించింది. కాని, ప్రక్కనే గంభీరంగా, భయంకరంగా నిల్చున్న తల్లిని చూసి భయపడి తన దుఃఖాన్ని కడుపు లోనే ఇముడ్చుకుంది. బండి కదిలింది. సుందరమ్మ మూతి విరుస్తూ తలుపు ఛడేలున మూసేసింది.

ఏ కబురూ లేకుండా వున్నపాటున మాలతి రావటంలో తండ్రి ఆశ్చర్యపోయేడు. తన రాకకు తండ్రి ఏ ఆశ్చర్య మూ పొందకుండా తగిన సమాధానాన్ని ముందుగానే సిద్ధ పరచుకుంది మాలతి, పైగా అన్నయ్య ఇంట్లో తనకు లభించిన ఆదరణల్నికూడా తండ్రికి తెలియచెయ్యటానికి ఆమెకు మనస్కరించలేదు. మాలతి స్వభావమే అది. ఏవేవో చెప్పి తండ్రిని నమ్మించిందికాని, మాలతి మనస్సుకు శాంతి, సంతృప్తి కలుగలేదు. గత విషయాలే మనస్సులో మెదుల్తూ ఆమెను మరింత కలవరపరిచేయి. పైగా తన వ్యర్థ జీవితాన్ని కొంతవరకైనా మర్చిపోయి, బ్రతికిన నాల్గు రోజులు సంతోషంగా గడపడానికి వీలుగా వుండే లలిత సహవాసంకూడా దూరంకావటంతో మరిం తగా బాధపడసాగింది. ఏ పని చేసినా, ఏమి చూసినా లలితే ఆమెకు జ్ఞాపకం వస్తూండేది. లలితకోసం ఆమె హృదయం తహతహలాడేది. కాని, "విధి" ఎదురుతిరిగి

నప్పుడు మానవ మాతృడేం చెయ్యగలడు? తనకున్న అసంఖ్యాకమైన సమస్యల్లో ఇదొక సమస్యగా పరిగణిస్తూ, పరిష్కార మార్గం తోచక తనలోనే కుమిలిపోతూ, జీవచ్ఛవంలా, నిర్జీవ ప్రతిమలా, రోజులు గడపసాగింది.

అత్తయ్య వెళ్లిపోయినదగ్గరనుంచి లలితకి ఇంట్లో ఏదో లోటు కనిపించసాగింది. బహుశా ఆమె హృదయం మాలతితోపాటు వెళ్లిపోయించేమో! లలితకు ఏపని చెయ్యటానికి తోచేదికాదు. పదే పదే అత్తను గురించి తల్లిని అడగటంతో, కన్న కూతురిపై తల్లికుండాల్సిన మమకారం సైతం విడనాడి చేతికందినదాంతో లలితను కొడ్తూండేది,

రోజులు గడిచినకొద్దీ లలిత చిక్కి శల్యమైంది. త్వరగా వచ్చేస్తానన్న అత్తయ్య ఎన్నటికీ రాకపోయేసరికి లలిత మనస్సుకు బెంగపట్టుకుంది. మనోవ్యథతో మంచం పట్టింది. మంచంపట్టిన లలితకు "అత్తయ్యా" నామమే జపమైపోయింది. రానురాను పరిస్థితి మరీ విషమించింది. ఈ లోకంతో సంబంధంలేనట్లుగా తయారైంది.

లలిత పరిస్థితి చూసి ఆనందరావు భయపడ్డాడు. పరుగెత్తిపోయి డాక్టర్ని పిల్చుకొచ్చేడు. డాక్టరు లలితను పరీక్షించి పెదవి విరిచాడు. రోగం ఏమీ కాదన్నాడు. మనోవ్యధకు మందేమిటి? అని ఎదురు ప్రశ్న వేశాడు. వెంటనే పిల్ల మనోవ్యధ తీర్చమని హితవు చెప్పేడు. పరిస్థితి చెయ్యి జారిపోయిన తరువాత ఎవరూ ఏమి చెయ్యకల్గిందిలేదని హెచ్చరించివెళ్ళిపోయాడు.

ఆనందరావు సుందరమ్మ ముఖంలోకి చూశాడు. సుందరమ్మ భర్త ముఖంలోకి నీళ్ళు నిండిన కళ్ళతో చూస్తూ నిల్చుంది. సుందరమ్మ ముఖం చూడ్డానికి ఆనందరావుకు అసహ్యమనిపించింది. పరిస్థితినింత వరకూ తెచ్చింది తన భార్యేనని బాధపడ్డాడు. సుందరమ్మంటే అసహ్యపడి గది వెతుక్కుంటూ తన గదిలోకి వెళ్ళిపోయేడు.

సుందరమ్మ పరిస్థితి త్రిశంకు స్వర్గంలా తయారైంది, కూతురు అవస్థ చావు బ్రతుకుల మధ్య సతమమౌతూంది, భర్త తననే అసహ్యించుకుంటున్నాడు. ముక్కు పచ్చలారని నిండు జీవితం నిప్పులపాలయి, ఆత్మశాంతి కోసం తన పంచను జేరిన మాలతి జీవితాన్ని మరింత అన్యాయంగా హింసించి వెళ్ళగొట్టింది తనేనని తెల్సుకుంది. బ్రతుకంటే ఎంతతీపో, బాధంటే ఏమిటో, అభిమానం అంటే ఎలా వుంటుందో తొలిసారిగా తెల్సుకోకల్గింది. సుందరమ్మ, ఆమె హృదయం పశ్చాత్తాపం చెందింది. పరిస్థితుల ప్రభావానికి లొంగిపోయింది. పాపాత్మురాలయిన తనకు భగవంతుడే తగిన ప్రాయశ్చిత్తం చేస్తున్నాడని నమ్మింది. లలిత కోసం పరితపించింది. లలిత ప్రాణాలు మాలతిచేతుల్లో ఉన్నాయన్న దృఢ నిశ్చయానికి వచ్చింది.

వెంటనే భర్త గదిలోకి వెళ్ళింది సుందరమ్మ. భార్యను చూసిన ఆనందరావు ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు. సుందరమ్మకు తెల్సు భర్త తననెందుకు అసహ్యించుకుంటున్నదీ. కాని,. గత్యంతరంలేదు. భర్త కాళ్ళు పట్టుకుంది. మాలతిని కూడా తీసుకురావటానికి వెళ్ళమని ప్రాధేయపడింది. తన కోసం కాకపోయినా ఒక్కగానొక్క బిడ్డ ప్రాణాల్ని కాపాడటానికి వెళ్ళమని బ్రతిమాలుకుంది. తన తప్పులన్నీ ఒప్పుకుంది. మాలతిని క్షమాభిక్ష అడుగుతానని చెప్పింది. ఏడ్చింది.

సుందరమ్మలో పరివర్తన కల్గించుకు ఆనందరావు సంతోషించినా, ఆమె మాటలు అతనికి సంతృప్తి కలిగించలేదు. ఇంటికి సర్వాధికారి అయివుండి కూడా స్వంత చెల్లెలు తనింట్లో అష్టకష్టాలు పడుతూంటే కళ్ళారా చూస్తూ వూరుకున్నాడు. భార్య పోరుపడలేక నిస్సహాయంగా ఇంటినుండి వెళ్ళిపోతూంటే మౌనం వహించేడు తను. కాని, ఆమె కష్టాలకు అడ్డురాలేకపోయేడు. ఆమె బాధలకు విముక్తి కల్పించటానికి ప్రయత్నించలేదు. ఆమె జీవితాన్ని ఏదో ఉద్ధరిస్తానని చెప్పి, నమ్మించి, ఆమెను మరింత అన్యాయంగా నిర్దాక్షిణ్యంగా హింసించటానికి కారకుడైనాడుతను. ఏ ముఖంపెట్టుకుని వెళ్తాడు. అతనికి మాలతి దగ్గరకు వెళ్ళటానికి మనస్కరించలేదు. కన్న కూతురుపై మమకారం కంటే, తోబుట్టువు మీద అభిమానం అడ్డువచ్చింది. విధి కృతం ఎలావున్నా మాలతి దగ్గరకు వెళ్ళకూడదనుకున్నాడు. తనిశ్చయాన్ని భార్యకు చెప్పేశాడు.

భర్తమాటలకు సుందరమ్మ నివ్వెరపోయింది. ఆ మాటలంటూన్నది తన భర్తేనని కొద్ది క్షణాలవరకూ ఆమెకు నమ్మకం కల్గలేదు. ఆమెకేం చేయ్యటానికి తోచలేదు. లలిత పరిస్థితి, భర్త నిశ్చయం ఆమెను మరింత కలవరపర్చేయి. తన బ్రతుకుకంటే ఆమెకు కావల్సింది లలిత ప్రాణం, అందుకోసం ఆమె ఎంతటి త్యాగం చెయ్యటానికైనా సిద్ధపడింది. తనే మాలతి వద్దకు పోయి లలితకు ప్రాణదానం చెయ్యవల్సిందిగా వేడుకోవడానికి సిద్ధపడింది. వెంటనే ప్రయాణానికి సన్నాహం కావటా

నికి లేస్తూ, భర్తకు తన నిశ్చయాన్ని చెప్పి బండితీసుకు రమ్మంది. ఆమె మాటలకు నిశ్చేష్ఠుడై పోయేడు ఆనంద రావు, గదిలోంచి పోతూన్న సుందరమ్మను చూస్తూ నిల్చుండి పోయేడు.

ఇంతలోనే తలుపులు దబదబా బాదుతుండటంతో పరుగెత్తి సుందరమ్మ తలుపులు తీసింది. ఎదురుగా మాలతి కనిపించటంతో సుందరమ్మ, నిశ్చేష్టురాలై పోయి నోటమాట కూడా రాలేదు. కాని, మాలతి ఇవేమీ గమనించలేదు. "లలితా! లలితా!" అని అరచు కుంటూ ఇంట్లో ప్రవేశించింది. చలనంలేకుండా వరండాలో మంచంమీద పడుక్కున్న లలితను చూసి గాభరా పడింది మాలతి గుండె తరుక్కుపోయింది. "లలితా!" అంటూ పిచ్చెక్కినట్టు గభాలున ఎత్తుకుని హృదయానికి హత్తుకుంది. ఎన్నాళ్ళకో తిరిగి అత్తయ్య పిలుపు చెవుల్లో పడటంతో లలిత కళ్లిప్పి చూసింది. తను అత్తయ్య చేతుల్లోనే వుండటంతో ఆమెలో ఎక్కడలేని శక్తి వచ్చి పడింది. అత్తయ్యకోసం మొహం చాచిన లలిత "అత్తయ్యా!" అంటూ గట్టిగా అరచి మాలతిని చుట్టె సింది. లలిత కళ్ళల్లో తిరిగి జ్యోతి వెలిగింది. మాలతిని చూడగానే లలితకు ఎక్కడలేని దుఃఖం పొంగుకొచ్చింది కంటికి మంటికి ఏకధారగా ఏడువసాగింది. లలిత కన్నీటి ధారలు మాలతి హృదయాన్ని తడిపేస్తూ మాలతి హృదయతాపాన్ని చల్లార్చసాగినాయి.

తన బిడ్డ ప్రాణాల్ని కాపాడటానికి దైవంలా వచ్చిన మాలతి తన కంటే చిన్నదయినా, కృతజ్ఞతాపూర్వకంగా, భక్తి, గౌరవాలతో మాలతి కాళ్ళను చేతుల్తో చుట్టేసింది సుందరమ్మ. ఆమె అలా వున్నప్పుడు తనను క్షమించ మని ప్రార్థిస్తున్నట్లుగా అర్థంస్ఫురిస్తూంది. కాని, మాలతి ఇవేమీగమనించే స్థితిలోలేదు. ఆమెకు కావల్సిందల్లా లలిత!

"అందరూ కావల్సిన" ఆనందరావు హృదయం అందరూ తిరిగి కలియటంతో ఆనందమయమైంది. అతని పెదవులపై చిరునవ్వులు నాట్యంచేసాయి! అతని కళ్ళలో ఆనంద భాష్పాలు చేరినిలిచాయి! ★



## ప్రజాసంస్థలు నిర్వహిస్తున్న అభివృద్ధి కృషి

రాజస్థాన్‌లోని ఒక సమాజ వికాస అభివృద్ధి బ్లాకులోని గ్రామ పంచాయితీ సభ్యులు సమావేశం జరుపుతున్న దృశ్యం యిది.

పంచవర్ష ప్రణాళికలను విజయవంతంగా అమలు జరపడానికి అభివృద్ధి కార్యక్రమం అన్ని దశలలోనూ ప్రణాళికా సహకారం అవసరం. అభివృద్ధి ప్రణాళికలరచన, నిర్వహణ, బాధ్యతలు ప్రజా సంస్థలకు అప్పగించాలన్న ప్రజాస్వామిక వికేంద్రీకరణ పథకాల ప్రధానలక్ష్యం అదే. స్వశక్తి, స్వయం సహాయాల ప్రాతిపథికపై స్థానికఅంగబలాన్ని, సాధన సంపత్తినీ సమీకరించడానికి గ్రామ, జిల్లా, బ్లాకుల స్థాయిలో వరుసగా పంచాయితీలు, పంచాయితీ సమితులు, జిల్లా పరిషత్తులను నెలకొల్పారు. ఈ సరికొత్త ప్రయోగాన్ని రాష్ట్ర వ్యాప్తంగా అమలు జరపడానికి ముందంజ వేసిన తొలి రాష్ట్రం రాజస్తాన్ అధికారులకు, అనధికారులకూ శిక్షణ కార్యక్రమాన్ని రాజస్తాన్ ఏప్రిల్ లో ప్రారంభించింది.

స్కెచ్

# ఇంగిత హాస్యాలు!!

శ్రీమతి బి. రాణి

"ఎక్కడికి వెళుతున్నారు?" అని అడిగింది ఉమ.

"క్లబ్బుకి" అని చెప్పాడు మోహన్.

"ఎన్ని నాళ్లు, అడిగినా యింటిదగ్గర ఉండరుకదూ" అని చిన్నబుచ్చుకుంది, ఉమ,

"నేను చెప్పిన మాట విన్నదాక యింతే, అడిగినా లాభంలేదు. హాయిగా, క్లబ్బులో స్నేహితులతో, విలాసంగా. కాలంగడిపే. వాళ్ళకి," పల్లెటూరి పిల్ల దగ్గిర తోస్తుందా? ఎప్పుడు నీవు విద్యా నాగరీకురాల వవుతావో అప్పుడే నేను యింటి దగ్గర ఉండటం."అంటుకోపంగా వెళ్ళిపోయాడు మోహన్.

పాపం ఉమ ఏడుస్తు కూర్చుంది

ఉమ కాపరానికి వచ్చి ఏడాది అయింది. పుట్టిల్లు పాలకొల్లు, అంత. పల్లెకాదు, పట్టణంకాదు. అక్కడే రమ ౮ వ తరగతి పాసయింది, సంగీతం, నృత్యం ఏమిరావు, ఏదో కొంచము, తెలివి తేటలు కలదే. మనస్సు చాలా మంచిది, ఉమ భర్త చెన్నపట్నంలో బి. ఏ పాసయి ఎల్. టి చదివి, విశాఖపట్టణంలో లెక్చరర్ గా పనిచేస్తున్నాడు, నవనాగరికత అన్నా, ఆడంబరాలు అన్నా, బాగా అలవాటయ్యాడు, ఉమ బాగా. చదువుకోవాలని, తనతో ఇంగ్లీషు బాగా మాట్లాడాలని తనతో, సినిమాలకు, క్లబ్బులకు తిరగాలని, సిగ్గుగా ఉండకూడదని, నవనాగరికతగా ఉండాలని, వచ్చింది మొదలు పోరుపెడుతున్నాడు,

ఉమ పూర్వపు సాంప్రదాయంల్లో పెరిగింది. సిటికి యిష్టపడేదికాదు, రోజు తన దగ్గర చదువుకోమని చెప్పేవాడు, ఉమకు ఇంగ్లీషు అంటేనే యిష్టములేదు. ఎప్పడయినా కర్మంచాలక చెప్పించుకొన్నా మళ్ళా అడిగిందాక పుస్తకం మొహం చూచేదికాదు. ఉమకు బాగా, చదువుచెప్పి కనీసం, "మెట్రిక్యులేషన్" అన్నా పాసు చేయించాలని అతనికోరిక. కాని ఉమకు అది యిష్టంలేదు, ఎన్ని చెప్పినా, వినేదికాదు. యిలాంటి. పిల్లతోటి, తన సరదాలన్ని తీరటంఎలా అని దిగులు పట్టుతుంది, మోహన్ కి, ఇల్లుపట్టకుండ తిరిగేవాడు. అలాగయినా శ్రద్ధ కల్గుతుందేమొ ఉమకు నని. అతనిఆశ, చివరికి ఒకరోజున ఉమతో నీవు చదువు కున్నదాక, మనం అన్యోన్యంగా ఉండటం కష్టమని చెప్పాడు. దానితో, ఉమ, మనస్సు చివుక్కుమంది. బెంగతో ఉమ నుంచ మెక్కింది. పుట్టింటివారు వచ్చి తీసుకెళ్ళారు, తన భార్యకు ఎందుచేత జబ్బు వచ్చిందో. తెలుసుకోలేక పోయాడు మోహన్, ఉమ వెళ్ళేటవ్వుడు, మిమ్మల్ని తృప్తి పరచగలిగిననాడే. మీ యింటిలో అడుగు పెడతా, అందాక నేను, మీ గడప త్రొక్కను. అని చెప్పి మరీ వెళ్ళింది ఉమ.

♦ ♦ ♦

ఉమ ఒక్కతే ఆడపిల్ల కావటంచేత గారాబంగా పెరిగింది. అన్ని ఉమ యిష్టప్రకారమే జరిగించేవారు. ఉమ మాటకు తిరుగులేదు ఆయింట.

డాక్టరు, ఉమకు మనోవ్యాధి అని చెప్పారు. ఎన్ని మందులు యిప్పించినా. లాభంలేక పోయింది "ఎందుకమ్మా నీకీదిగులు అని అడిగాడు తండ్రి" బలవంతము, మీద. అంతా చెప్పగలిగింది "దీనికేనా, నేను చెప్పతాను. చదువుకోమన్నాడు.

తండ్రి క్రమముగా, పాఠాలు నడుస్తున్నాయి. యిప్పుడు ఆరోగ్యం కొంచము బాగుపడ్డది, ఉమ మనస్సు కొంచము స్థిమితపడ్డది.

ఉమ వెళ్ళి. ఆరునెలలయిన, సంపమనికాని, ఎలా ఉంది అనికాని ఉత్తరంకూడ రాయలేదు, మోహన్. ఇంట్లో, చేసేవారులేక, భోజనం, హోటల్ నించి, తెప్పించుకోనేవాడు, అప్పుడు. ఉమ లేనిలోటు కనుపించేది చాలా బాధపడేవాడు. నాకెందుకీ దుర్బుద్ధి, పుట్టాలి, లోకంలో అందరాడవాళ్ళు, చదువుకొనే కాపరాలు చేస్తున్నరా? ఇదంతా, మా దురదృష్టం కాబోలు. నన్నుగురించి ఎంతభాధపడుతున్నదో. అని విచారించేవాడు, అన్నం సరిగ్గా ముట్టుకొనేవాడు

కాదు విచారంతో, ఆ తరువాత క్లబ్బులు స్నేహితులు ఆ లోకంలోపడేవాడు. పోని నాగురించి దిగులుపడ్డా చదువుకుని బాగు పడుతుందికదా అని సంతోషించే వాడు. తనకు భోజనానికి యిబ్బందిగా ఉన్నదని తన పిం తల్లి అయిన రాజమ్మగార్ని పిలిపించు కొన్నాడు భార్యకు జబ్బుచేసి పుట్టింటికి వెళ్ళిందని చెప్పాడు. రాజమ్మ కోడల్నిచూడా తీసుకురమ్మని పోరు పెడు తున్నది రోజూ.

తీసుకొస్తా తొందరేమిటి అని సమాధానంచెప్పి ఊరుకొనేవాడు.

వీళ్ళేదో దెబ్బలాడుకున్నారు. పండంటి కాపురం యిట్లాఅయిందే అని విచారించేది. అప్పటికి రాజమ్మ వచ్చి నెలఅయింది ఒకరోజున. మోహన్‌కి అన్నం పెడుతూన్నప్పుడు అడిగింది "అబ్బాయి ఉమని చూచి చాలా రోజులయింది, చూడాలనిఉంది, తీసుకు రా మళ్ళినేను వెళ్ళాలి" అంది రాజమ్మ,

"నేనువెళ్ళి తీసుకురాను తనకు బుద్ధి పుట్టినప్పుడు తానే వంగాది" అన్నాడు కోపంగా

రాజమ్మస్తురికి గుండె ఆగినంతపనయింది, తనకొడుకు,ఇంక కోడల్ని తీసుకురాడని నిశ్చయించుకొంది ఉమ చదువుకుంటున్న విషయం, మోహన్‌కి తెలియదు. తెలుస్తే, తీసుకురావచ్చు నేమొ ?

ఉమ రెండేళ్ళు తండ్రివద్దచదివి, స్కూల్ ఫైనల్ పరీక్షకు వెళ్ళింది అన్ని పరీక్షలు బాగానే రాసింది, యింతవరకు చదువుబెంగ, యిప్పుడు, ఫలితాలెలా వుంటాయా అనే బెంగ,

♦ ♦ ♦

మద్రాసులో రాజమ్మ మేనత్త రుక్మిణమ్మకి ఉమని, తీసుకు రానన్నాడిని. తనకేమి, తోచటం లేదని, తక్షణంరమ్మని రాసింది, రుక్మిణమ్మ ఆదుర్దాగా పరిగెత్తుకు వచ్చింది, సంగతంతా గ్రహించి, యింకో సంబంధము చేసుకుంటాడెమొ, అడుగుదామంది, రాజమ్మకిది యిష్టము లేకపోయినా రుక్మిణమ్మ బలవంతము మీద సరేనని అడిగింది.

వాళ్ళు అలా అడగ్గానే హృదయం మీద వెయ్యి శూలాలు ఒక్కసారి పొడిచినట్లుయింది. తన దగ్గర ఆ ప్రస్తావనమళ్ళాతెస్తె మాట దక్కదని చెప్పాడు. కాని అతని మనస్సులో ఒక విధమయిన దిగులు, పశ్చాత్తాపం, సిగ్గు ప్రవేశించాయి, తాను పెద్ద అప రాధంచేసిన వాడిలా భావించుకొని, తాను ఉమకు అన్యాయంచేసాను అను కొన్నాడు. ఈ బాధంతా ఎందుకు, నాలుగైదురోజులుచూచి, రాకపోతే తానే పోయి తెద్దామని నిశ్చయించుకొన్నాడు.

నాల్గు గంటలయింది, మోహన్ క్లబ్బుకి వెళ్ళటానికి, సూటు వేసుకుంటున్నాడు. యింతలోకి గుమ్మం దగ్గరబండి ఆగిన చప్పుడుయింది, ఎవరు చెప్మా అనుకుంటు, కిటికీలోంచి చూచాడు నవనవో న్మేష సౌందర్యవిలాసిని అయిన, 19 ఏళ్ళ యువతి కాళ్ళకి, బూట్సు, కుడిచేతిలో రిస్టువాచి. మెడలో గొలుసు, రెండు జళ్ళు, వేసుకోని, వయ్యారంగా, నడుస్తు ఒకపురుషునితో లోనప్రవేశించింది. మోహన్, ఆ అపరచితుణ్ణిచూచి. నిర్ఘాంతపోయి. ఏమాయి బావా ? ఎక్కణ్ణించి రావటం అన్నాడు అతనితో అంత పరిచయముగా వచ్చిన స్త్రీ ఎవరు? అని ఆమె వైపుచూస్తు "యింటిదగ్గరనించే, చిరునవ్వుతో సమాధానమిచ్చాడు బావమరది అయిన మూర్తి, రాజమ్మ, రుక్మిణమ్మ ఆ యువతిని విస్తుపోయి. వింత జంతువుని చూచినట్లు చూస్తున్నారు. అంతలోనే రుక్మిణమ్మ పోయి కాళ్ళకు నీళ్ళు పట్టుక వచ్చియిచ్చింది, కుశల ప్రశ్నలయిన తరువాత ఉమ తిన్నగా గదిలోకి వెళ్ళి, తన్నుగుర్తించినా మోహన్‌కి ఒక కార్డు అందించింది. రాజమండ్రినుండి బావమరది మూర్తి రాసిన కార్డది, ఉమ స్కూల్ ఫైనల్ ప్యాస్ అయినట్లు మోహన్‌కి. ఆశ్చర్యం పట్టజాలనంత ఆనందము కల్గాయి, తాను అదృష్టవంతుడ ననుకున్నాడు "ఎక్కడికో ప్రయాణ మయినట్లున్నారే" అంది ఉమ సర్వంగా.

"యిక్కడికే" అన్నాడు మోహన్ సంతోషంగా.

ఉమకు వచ్చినదీక్ష. చదువు మీద శ్రద్ధచేయ లేక భర్త మీద అభిమానంచేతనా? యిప్పటికీ తేలలేదు- హుం యింగిత శూన్యులు ! అనుకున్నారు రాజమ్మ రుక్మిణమ్మలు.



# అసమర్థులు

కథానిక :

**శ్రీ పి. నరసింగరావు**

"ఆదేమిటయ్యా పండుగపూటా దాన్ని పట్టుకుని అలా సాధిస్తావు?" అని గదిలోకి వెళ్లి యశోదమ్మ అల్లుణ్ణి వాదించేలోగానే లలిత చెంప ఛెళ్ళుమనిపించి వెంకటేశం వీధిలోకి వెళ్ళిపోయాడు.

చావిట్లో కూర్చొని రేడియో వింటున్న గీతా, మూర్తి ఈ ఆకస్మిక సంఘటనకు నిర్ఘాంతపోయారు.

"ఎరక్కచేశాం. వెధవ సంబంధం. పండుగపూటా మా కళ్ళముందే చెయ్యి చేసుకుంటాడా? పెళ్ళయిన తరువాత బిడ్డ ఒక్కనాడైనా సుఖపడలేదు" అంది యశోదమ్మ లలితను ఓదారుస్తూ.

చంకలోని బిడ్డకు పాలిస్తూ "ఏంచేస్తామమ్మా ఆయనది పట్టి ప్రథమకోపం, తొందరపాటు స్వభావం" అంది లలిత కన్నీరు తుడుచుకుంటూ.

"నువ్వు చెప్పకపోయినా మాకన్నీ తెలుసు తల్లీ. ఏంచెయ్యడం? వయస్సు మించిపోతోందన్న ఆందోళనతో ఆశనిగ్రహం గోల పడలేక నిక్షేపం లాంటి సంబంధమంటే తొందరపడి పీగొంతుకొక్కశాం" అంది యశోదమ్మ కూడా కన్నీరు కారుస్తూ.

మూర్తి ఊరుకోలేక "ఇన్ని ఎంతసేపూ వంశం, కులం, గోత్రం, జాతకాలు సరిపడ్డాయాలేదా? ఋషులుకలిశారాలేదా? అన్న గోల తప్ప కుర్రాడు యోగ్యుడా కాదా? ఆరోగ్యవంతుడేనా కాదా? కట్టుకున్న దాన్ని సుఖపెడతాడాలేదా? అన్న విషయాలే ఆలోచించారు కాదు. బొమ్మ నిశ్చయించుకుని వచ్చేసరికి, చిన్నన్న నువ్వూ కూడా ముందూ వెనుకా ఆలోచించకుండా ఈసంబంధం తప్పితే మరి లలితక్కకు పెళ్లి కాదేమోనన్నట్లు ఖంగారు పడి పెళ్ళిచేశారు" అన్నాడు ఉక్రోషంగా.

"అదే నయ్యా. అప్పుడా ఆలోచనే లేకపోయింది. పెళ్లినాటికి పద్దెనిమిది నిండకపోయినా వయస్సు ముదిరిపోతోందన్న భయంతో తెలివి తక్కువ పని చేశాం అందుకే పిల్లా మేమూ కూడా అఘోరిస్తున్నాం"

"ఆడపిల్లలకు సహజంగా సిగ్గు భయం ఎక్కువ, సాధారణంగా మనస్సులోని మాట పైకి చెప్పలేదు. అందుకే వివాహానికి ముందు అబ్బాయి నచ్చేడాలేదా? అన్న విషయాలు ఏదోవిధంగా పెద్ద వాళ్ళు రహస్యంగా తెలుసుకోవాలి."

"ఎందుకూ చూస్తావుగా! గీతను అందుకే చదివిస్తున్నా. దానికి ఇష్టం లేకపోయినా తగిన

వాడూ, యోగ్యుడూ దొరక్కపోయినా, ఒక్క నాటికి ఇష్టంలేని పెళ్ళి చేయను. అంతగా కాక పోతే హాయిగా ఉద్యోగం చేసుకుని దాని పొట్ట అది పోషించుకుంటుంది'' అంది యశోదమ్మ.

గీత నును సిగ్గుతో "అబ్బా పోనీ అమ్మా నీకెప్పుడూ పెళ్ళి గోడవే'' అని కాఫీ కలుప డానికి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

యశోదమ్మలో కల్గిన ఈ మార్పుకు మూర్తి చాలా తృప్తి చెందేడు. అందులో ఇటీవల యశోదమ్మ తరచు మహిళా సంఘానికి వెడు తూంది. అక్కడ ఏవో ఒకటి రెండు సందర్భా లలో, ఆడ పిల్లలకు వివాహ విషయంలో తగి నంత స్వేచ్ఛ నివ్వాలనీ, ఎంత కట్నమైనా సరే ఇచ్చి ఏదో విధంగా వివాహం చేసి ఆడపిల్లలను అత్తవారింటికి పంపివేయాలన్న పాతసాంప్రదా యాలను వదలి, అవసరమై లేక ఏ కారణం చేతనైనా ఆడపిల్లలకు వివాహం ఇష్టంలేని పక్షంలో, తగినంత చదివించి వాళ్ళపొట్ట వాళ్లను పోషించుకోనివ్వాలని ఘాటుగా కబుర్లు కూడా చెప్పిందట. గీత వివాహ విషయంలో ఆమె అభిలాష తప్పక నెరవేరుతుందనీ, సుఖ పడుతుందని ఆశపడ్డాడు—

మూర్తి పినతండ్రైన గోపాలంగారికి ముగ్గురూ ఆడపిల్లలే. పెద్దమ్మాయి సీతకు దగ్గర సంబంధం చేయడం నుంచి అంత ఇబ్బందిలేక పోయింది. ఒడుదుడుకులు లేకుండా ఆమె సంసారం ఓ మాదిరిగా బాగానే సాగిపోతూంది. ఇక రెండో అమ్మాయి లలితకు పద్నాలుగో ఏడు వచ్చిన దగ్గరనుంచీ, నాయినమ్మ అంటే బామ్మ 'పిల్ల ఎదిగిపోతూంది వెంటనే పెళ్ళిచేసే యాలని' ఒకటే గోల పెట్టింది. మంచి సంబంధం కావాలంటే వేలకు వేలు గుమ్మరించాలి, అంత ఆర్థిక స్థోమతలేదు. దానికి తోడు గోపాలం [illegible] జాతకాలూ. గోత్రం శాఖ ఋషులు ఇవన్ని తూచినట్లు సరిపడాలన్న పట్టుదల బాగా ఉండడాన్ని ఓ పట్టాన సంబంధం ఏదీ కుదిరిందికాదు. అనుకోకుండానే నాలుగేళ్ళు దొర్లిపోయాయి. కోసకు ఎలా గయితేనేం, బామ్మ వెతికి వెతికి, యోగ్యుడూ బి. ఏ. వరకూ చదివి గుమాస్తాగా పనిచేస్తున్న ఓ వరుణ్ణి తీసుకువచ్చి ఆమోద ముద్ర వేయడం జరిగింది. నిజానికి లలితను 'నీకీపెళ్ళి ఇష్టమేనా?' అని అని అడిగితే అవివాహం జరుగకపోయే దేమో! కాని మధ్య తరగతి కుటుంబాలలో ఆడపిల్లలను అలా అడిగే వాళ్ళెవరు? వద్దన డానికి అంత స్వాతంత్ర్యం ఎక్కడుంది? పెళ్ళి యథావిధిగా జరిగిపోయింది. పెళ్ళికి ముందరే కట్నాలు లాంఛనాలూ నిర్ణయించుకుని తు. చా. లు. తప్పకుండా గోపాలంగారు అన్ని ఆచరించి ఏలోటూ చెయ్యకపోయినా, పెండ్లి కొడుకు మగపెళ్ళివారూ ఆడపెళ్ళివారిని అన్ని విధాలా ఏడ్పించుకుతిన్నారు. పెళ్ళయిన కొద్ది కాలంలోనే, వెంకటేశం బి. ఏ. చదువలేదనీ, ఇంటర్ మొదటి సంవత్సరంలోనే చదువుకు స్వస్తి చెప్పేడనీ, ముక్కోపి అనీ, భార్య అంటే కేవలం వంటలకో పనిమనిషో అన్న అభి ప్రాయం తప్ప అంతకన్నా మంచి అభిప్రాయం అతనికి ఏకోశాన్నా లేదనీ తెలిసిపోయింది.

పెళ్ళయిన తరువాత భర్త లోటుపాట్లను అంతగా పట్టించుకోకుండా, తన అసంతృప్తిని మరచిపోయి, లలిత క్రమంగా భర్తను ప్రేమిం చడం నేర్చుకుంది. కాని ఆమె శాంతం, ఓర్పు, చక్కదనం, భర్త యెడల గల శ్రద్ధా భక్తులు వెంకటేశం మనస్సును మార్చలేక పోయాయి. తరచు వెంకటేశం ఏదో మిషమీద లలిత ఒంటి మీద చెయ్యిచేసుకోవడం అతి సాధారణ విషయమైపోయింది. హిందూ సాంప్రదాయ ప్రకారం, భర్త పెట్టే హింసలను భరించడం లలిత నేర్చుకుంది. ఎటొచ్చీ కూతురు కాపురం ఇలాగైనందుకు యశోదమ్మ

కంటతడిపెట్టని రోజులేదు. కాని చేతులు కాలేక చెయ్యగల్గేదేముంది?

♦ ♦ ♦

మరో రెండు సంవత్సరాలు దొర్లి పోయాయి. గీతకు పదిహేడు సంవత్సరాలు నిండిపోయాయి. స్కూలుఫైనలు ప్యాసైంది. చామనఛాయ శరీరంతో చెంపకు చేరడేసి కళ్లతో, పొడవైన జడతో, ఎంతో ఆరోగ్యం గానూ, ఆకర్షణీయంగానూ ఉండేది. ఆమె మాటల్లో ఎంతో మాధుర్యం ఒలికేది. మూర్తి కనీసం వారాని కొకసారైనా గీతను చూడ్డానికి పినతండ్రి గారింటికి విధిగా వచ్చేవాడు.

ఆనాడు మూర్తి వచ్చేసరికి గీత వివాహ ప్రస్తావన జగురుతూంది.

"ఒరే గోపాలం, ఇక చూడవలసిన పని లేదు. జాతకాల అద్భుతంగా సరిపడ్డాయి. రెండువేలు కట్నం. ముహూర్తం పెట్టించు" అంది బామ్మ.

మూర్తి తెల్లబోతూ "అయితే శేఖరానికి ఇవ్వరా?" అన్నాడు.

"అదెలాగోయ్. ఋషులుసరిపడలేదు" అంది యశోదమ్మ.

"ఇలాంటి పిచ్చినమ్మకాలు పెట్టుకుని దాని గొంతుక కోస్తారా? "

"మొదట్లో అనుకున్నాం గాని, ఋషులు సరిపడకపోతె లాభంలేదురా" అన్నారు గోపాలంగారు.

"అయితే గీతను అడిగేరా?" అన్నాడు మూర్తి.

"ఆ ఇవన్నీ దాన్ని అడుగుతారా? " అంది పెద్దక్క సీత తన పెళ్ళికి జరిగిన సాంప్రదాయం గుర్తుకు తెచ్చుకుని.

మూర్తి ఒక్కక్షణం ఆలోచనల్లో మునిగి పోయాడు. గీతకు శేఖరం అంటే ప్రాణం అన్న విషయం బాగా తెలుసు. ఆమె వివాహం ఒక్కరితో నిశ్చయమై పోతూందంటే ఎలా ఊరుకోగలడు?

ధైర్యంగానే "అయితే గీత ఇష్టాయిష్టాలతో నిమిత్తలేకుండానే వివాహం నిశ్చయం చేస్తారన్న మాట" అన్నాడు పిన్నితో "ఆ ఇష్టానికే ముంది? పెద్దవాళ్లం మాకామాత్రం మంచీ చెడ్డా తెలియదూ?" అంది బామ్మ గీతకు, శేఖ రానికి ఏవిధమైన చెడు సంబంధం లేకపోయినా ఒకరిని ఒకరు వివాహం చేసుకోవాలని నాలుగైదు ఏళ్ళుగా కలలుకంటున్నారు. మొదట్లో పెద్దలు కూడా అలాగునే అను కున్నారు. కాని ఆనిర్ణయం ఇప్పుడు కూడ పోయేసరికి గీతకు అన్యాయం జరిగిపోతూందన్న బాధతో ఎలాగైనా మరోపై సంబంధం కాకుండా, శేఖరానికే ఇచ్చి లక్షణంగా వివాహం చెయ్యమని మూర్తి అనేక విధాల ప్రయత్నించాడు. కాని కాలేజీలో చదువు కుంటూ ఇంకా ఇరవై ఏళ్ళయినా నిండని మూర్తి మాటలు వినేదెవరు?

ఆఖరు ప్రయత్నంగా "అయితే శేఖరానికి ఇవ్వకపోతే వివాహమే తనకు వొద్దు ఉద్యోగం చేసుకుంటా నంది కదా పోనీ దాని ఖర్మాన్న దాన్ని బ్రతుకనివ్వకూడదా" అన్నాడు "ఆ అదెలా వీలౌతుంది? ఆనాడేదో మాటకు అను కున్నాంగాని, వయసువొచ్చిన ఆడపిల్లలు పెండ్లి చేసుకోకుండా ఉద్యోగం చెయ్యడం మన ఇంటా వంటాలేదు" అని

యశోదమ్మ ఖండితంగా తేల్చి వేసింది. మూర్తి నిర్ఘాంతపోయాడు —

♦ ♦ ♦

గీత మనస్సులో తుఫాను చెలరేగింది. మన సారా ప్రేమించిన శేఖరాన్ని వివాహం

చేసుకోవాలంటే, కనిపించిన తల్లిదండ్రులకు దూరం కావాలి. సంఘాన్ని, సాంప్రదాయాలను ధిక్కరించాలి. శేఖరం తనకు అన్యాయం చెయ్యడని తెలుసు కాని, మొదటి నుంచీ, కట్టుబాట్లలో పెరగడంనుంచీ, తల్లి దండ్రులంటే భయభక్తులు కలది కావడం నుంచీ ఎక్కడికో పారిపోయి శేఖరాన్ని వివాహం చేసుకోడానికి అంగీకరించలేకపోయింది. ఈ సందర్భంలో మూర్తి ప్రోత్సాహం నిష్ప్రయోజనమైంది.

పెద్దల ఇష్టప్రకారం ముహూర్తం నిశ్చయమైంది. ఇష్టంలేని పెండ్లికి ఒప్పుకున్నా గీత లోలోన దుఃఖంతో కుమిలి పోతూనే ఉంది.

ఏర్పాట్లన్ని తగినట్టుగా చేశారు. ఇల్లంతా బంధువులతో కల కల లాడుతూంది. నవ్వులూ కేరింతాలూ, ఏక హడావుడిగా ఉంది.

ఎవరి ఉత్సాహం ఆనందం వారివేగాని గీత మనస్సులోని క్షోభ ఎవరికి కావాలి? తప్పని సరిగాలేని ఉత్సాహం తెచ్చుకుని పెండ్లి పందిరిలో తిరుగుతున్న మూర్తికి మాత్రం గీత చూపుల్లో, మాటల్లో చేష్టల్లో 'భర్త మంచివాడైతేనేం, కాకపోతేనేం? కురూపైతేనేం రూపసి అయితేనేం? తను మనసు పడిన వ్యక్తి దొరక్కపోయిన తరువాత ఎవరైతేనేం ఏమయితేనేం? " అన్న వైరాగ్యం స్పష్టంగా గోచరించింది. బాధతో కృంగిపోయాడు. కాని చేయగల్గేదేముంది?

ఇకమిగిలిన వాళ్ళలో అదో బాధను అర్థం చేసుకున్న వాళ్ళెవరు?

ఎవరికి కావాలి?

ఆడవాళ్లకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కావాలిఅని అందరూ అన్నవాళ్ళే. కాని జీవితంలో అతిప్రధానమైన వివాహ సందర్భంలోనైనా అన్యం పుణ్యం ఎరుగని అమాయక ఎంతవరకూ స్వాతంత్ర్యం ఇస్తున్నారు?

గీత కన్నీటి ధారలు మంగళ స్నానాలతో కడిగివేశారు!

శోక స్వరాలు బ్యాండు వాయిద్యాలతో మిళితమైన పోయాయి!!

వివాహం సవ్యంగా జరిగిపోయింది.

జీవిత శేషాన్ని భర్త కౌగిలిలో వెళ్ళబుచ్చడానికి గీత అత్తవారింటికి ప్రయాణం అయింది.

యశోదమ్మ గోపాలరావు తమబాధ్యత తీరిందన్నట్లు తృప్తిగా ఊపిరి పీల్చుకున్నారు

మూర్తి కళ్ళవెంట అప్రయత్నంగా రెండు కన్నీటి బొట్లు రాలిపడ్డాయి...



# దసరా వేడుకలు

## దసరా వేడుకలు_ఆంధ్ర మహిళా సభ - మద్రాసు

ఏటేటా ఆంధ్ర మహిళా సభ మద్రాసు, భవన ప్రాంగణంలో దసరా ఉత్సవాలు ఘనంగా జరగడం. వాటికై సభ్యులు, అభిమానులూ ఎదురు చూడడం ఒక సాంప్రదాయంగా అయింది. వచ్చే సంవత్సరంన్నరలోనూ రజతోత్సవం జరుపుకో బోతున్న యీ మహిళా సభ వారి యీ సంప్రదాయం గట్టి పునాది మీద వేచినదే.

ఏటా ఉత్సవం కంటె యీ సంవత్సరపు వేడుకలు యింకా ఉత్సాహ జనకంగా వున్నాయి. అందుకు కారణం, వ్యవస్థాపకురాలు శ్రీమతి దుర్గాబాయి గారు ఉత్సవాలకి రావడము. శ్రీ దేశ్ ముఖ్ దంపతులు ఉత్సవాలు ప్రారంభం అయిన రోజునే వచ్చి నాల్గు రోజులూ వేడుకలలో పాలు పంచుకున్నారు.

వృద్ధురాలైనా ఏమాత్రం ఉత్సాహం కొరవడని కాంతిపుంజాలలో శ్రీమతి బెన్నూరికృష్ణవేణమ్మగారి పేరు చెప్పకతప్పదు. యీ సందర్భంలో ఎండవానల లెక్క లేకుండా యీనాటికీ రోజూ సాయంత్రం మహిళాసభ భవన ఆవరణలో పిల్లలను చేరదీసి హిందీ పాఠాలు చెప్తు వుంటారు, సభలో ఏ హడావిడికీ యీమె ప్రాపులేందే కావలసిన ఉత్సాహం రాదు. అందరూ ముద్దుగా అమ్మమ్మగారూ అని పిలిచే యీమెకి శరీర శ్రమ ఓ లెక్కలోది కాదు వీరి ఉత్సాహానికి చేయూతకి ఆంధ్రమహిళ జోహారు లర్పించవలసి వుంది.

పుర ప్రముఖులు, సంఘ సేవికలు, సభ్యులు వందల మంది వచ్చి నాల్గు రోజుల పాటు మహిళా సభ దసరా వుత్సవాలని తిలకించారు.

పాందిరి కట్టిన పందిర క్రింద కుర్చీలు అమర్చారు. తోట ఆవరణ అంతా దీప తోరణాలు కట్టి అలంకరించారు. బొమ్మల కొలువు అమర్చారు. అక్కడ వచ్చిన ప్రతి వారికీ పసుపు కుంకుమ తాంబూలం ప్రసాదం అందిచారు.

మహిళల చేతి పనుల ప్రదర్శన జరిగింది. ఈ ప్రదర్శనలో నగరంలోని. పై వూరి అనేక సంస్థలు పాల్గొన్నాయి. ఎంతో మంది చిత్ర కారిణులు తమ చిత్రాలను ప్రదర్శించారు. మహిళారచయితల పుస్తక ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది విజ్ఞాన శాస్త్ర ప్రదర్శనం కూడా ఏర్పాటు చేయబడింది. పిల్లలకీ పెద్దలకి ఆటల పోటీలు ఏర్పాటు చేయ బడ్డాయి.

మొదటి రోజు ఉత్సవాలకీ ప్రదర్శనకీ శ్రీమతి సౌందర్యమ్మాళ్ సైమన్ ప్రారంభోత్సవం చేశారు. సభ్యులతో, పిల్లలతో ప్రాంగణం కల కలలాడింది. ఆ రోజు వినోద కార్యక్రమం మహిళా సభ విద్యాలయ వారు నిర్వహించారు. మళయాళంలో నాటిక నొకదాని ఆంబర్ విద్యాలయ విద్యార్థినులు ప్రదర్శించారు. వింజమూరి సోదరీమణులు శ్రీమతి సీత అనసూయలు లలిత సంగీతం విన్పించారు.

రెండవ రోజు కుమారి చిత్ర నృత్యం జరిగింది. నృత్యంతోనే దేశ్ ముఖ్ దంపతులను మాలాలంకృతులని చేసింది కుమారి చిత్ర. ఈ నాట్యం అందరినీ రంజింపచేసింది. మహిళా సభ విద్యార్థినులు 'పెళ్లి కంట్రోల్' అనే హాస్య రూపకాన్ని ప్రదర్శించారు. తర్వాత ఆంధ్ర మహిళా ప్రెస్ కంపోజిటరులంతా 'గ్రామలక్ష్మి' అనే ప్రబోధాత్మకం అయిన నాటిక ప్రదర్శించారు. ఇదికూడా పలువురి మన్ననలందు కొంది.

మూడవ రోజు కార్యక్రమాన్ని మహిళా సభ నర్సింగుహోమ్ వారు నిర్వహించారు. నాటి కార్యక్రమాలన్నీ ఉన్నతమైన కృషిని చాటాయి, భావ గర్భితం అయిన "కవిగారి కల" అన్న ఇంగ్లీషు ఫాంటసీ, "సెలవల్లో" అన్న హాస్య రూపకం. మందు మరవెట్టయ్, అన్న తమిళ నాటిక అన్నీ అందరూ మెచ్చుకున్నారు, మళయాళీ పడవ పాట చాలా బాగుంది. చివరిగా ఏర్పాటు చేసిన "మేము భారత మాత సంతానం" అన్న టాబ్లో కన్నుల పండువగా వుంది.

నాల్గవ రోజు, భవన ప్రాంగణంలో నిలువ స్థలం కూడా లేనంత సమ్మర్దం ఆరోజే మహిళా సభ విద్యార్థినులు వాసవదత్త నృత్య నాటిక ప్రదర్శించారు. ఈ గేయ రచన శ్రీ దేశ్ ముఖ్ గారిది. వంగీయమూలాధారంగా శ్రీ దేశ్ ముఖ్ రచించిన గేయాన్ని

శ్రీ 'రజని' గారు తనిగించాయి. దానిక శ్రీ 'మల్లిక్' సంగీతం కూర్చారు. శ్రీమతి సామ్రాజ్యం నాట్య రూప కల్పన చేసింది. వాసవ దత్తగా కుమారి గజలక్ష్మి అద్భుత ప్రదర్శన యిచ్చింది. ఉపగుప్తునిగా కుమారి లక్ష్మిపున్నమ్మ భావ గర్భితంగా నటించింది. నాట్య అనంతరం కరతాళ ధ్వనులు మిన్నుముట్టారు. తరువాత సభకు పోషకు రాలైన శ్రీమతి ధనలక్ష్మి సుందరలాల్ సహతా వివిధ పోటీలలో గెలిచిన వారికి. బహుమతులం దించారు. మద్రాసుప్రభుత్వం మహిళాభ్యుదయ శాఖ అధికారిణి శ్రీమతి జయలక్ష్మిరావు అధ్వర్యం వహిం చారు. వారు మహిళా సభ పలుముఖ కృషికి నివాళు లర్పించారు. జాతీయ గీతం పాడటంలో వుత్సవాలు పూర్తి అయాయి.

విజయదశమి ఉదయాన్నే నాగేశ్వర శిశు విహార్ లోని పాఠశాలలో ఎలిమెంటరీ తరగతులకి శ్రీ వి. హనుమంతరావు గారు ప్రారంభోత్సవం చేశారు. దేశ్ ముఖ్ దంపతులూ, అనేక మంది పురప్రము ఖులూ యీ సందర్భంలో విచ్చేశారు.

ఈ ఉత్సవ సందర్భంలో చాలా మంది మహిళా సభ శాశ్వత సభ్యులయ్యారు. క్రిందటి మాసం ఆంధ్ర మహిళలో ప్రచురించిన శాశ్వత సభ్యులు హైదరాబాదు శాఖ వారి ఆధ్వర్యం క్రింద చేరిన వారు, యీ సంచికలో మేం ప్రచురిస్తున్న వారు మహిళా సభ మద్రాసు వారుచేసిన సభ్యులు వారిక్కి పండుగలు ఎంతో సరదాగా గడవడానికి తోడ్పడిన అందరికీ కృతజ్ఞతలు తెల్పడం నిర్వాహకుల



నాగేశ్వర శిశు విహార్ ఎలిమెంటరీ విభాగానికి ప్రారంభోత్సవం సల్పుతున్న శ్రీ వి. హనుమంతరావు గారు, దేశ్ ముఖ్ దంపతులు మొదలైన ప్రముఖులు.

కృతజ్ఞతా పూర్వకం అయిన విధి.

—"రుద్రాణి"

## ఆంధ్ర మహిళా సభ—హైదరాబాదు దసరా వేడుకలు,

ఆంధ్ర మహిళా సభ హైదరాబాదు శాఖవారు అక్టోబరు 9-10-11 ఆరో తేదీలలో దుర్గాష్టమి, మహార్నవమి, విజయదశమి పండుగలు జరుపుకొన్నారు. చేతి పనుల ప్రదర్శనకు శ్రీమతి జి. పి. ఎస్ నాయర్ ప్రారంభం చేశారు. 9 వ తేదీ ఉదయాన్నే దేశ్‌ముఖ్ దంపతులు వచ్చి చూశారు. దసరా సందర్భంలో బొమ్మల కొలువు కూడా పెట్టారు. కుమారి కామాక్షి స్వాగతం చెప్పింది. సాయంత్రం వినోద కార్యక్రమం జరిగింది. మిసెస్ నాయర్ మాట్లాడుతూ, మహిళలకు శ్రీమతి దుర్గాబాయ్‌గారి, అధ్వర్యం క్రింద ఆంధ్ర మహిళా సభ యెనలేని సేవ చేస్తున్నారు అన్నారు, మహార్నవమి నాడు కూడా వినోద కార్యక్రమం జరిగింది.

ఆటల పోటీలు జరిగాయి. ఆరోజు శ్రీమతి ఆర్. భాస్కరరావు నాయుడు అధ్వర్యం వహించారు శ్రీమతి బాశిరెడ్డి బహుమతి ప్రదానం చేశారు.

సంయుక్త కార్యదర్శిని శ్రీమతి లీలా గౌరి బాజీ ఆదాయ వ్యయాలను గురించి, విరాళాలను గురించిన రిపోర్టు చదివారు శ్రీ జి. జి అరే ప్రముఖుల దగ్గిర నుంచి వచ్చిన సందేశాలను చదివారు.

కె. సుగుణమణిగారి కృతజ్ఞతా వందనాలతో దసరా వేడుకలు ముగిసాయి. దసరా విరాళవివరాలు విడిగా యిచ్చాము.



చేతిపనుల ప్రదర్శనకి ప్రారంభోత్సవం చేస్తున్న శ్రీమతి లౌర్దమ్మాళ్ సైమన్.

# కృతజ్ఞత

## దసరా సందర్భంలో యావజ్జీవసభ్యులైన వీరికి మాకృతజ్ఞత

1. శ్రీమతి బి. శకుంతలమ్మగారు.
2. డాక్టరు. సరోజిని వేదమాణిక్యంగారు
3. డా ,, ఎమ్. పవనాబాయిగారు
4. కుమారి వి. రంగాగారు
5. డా ,, కె. ఆర్. అంబుజాగారు
6. శ్రీమతి జనెట్ ఫ్రెడరిక్‌గారు
7. శ్రీమతి ఎస్. వళ్ళియమ్మగారు
8. శ్రీమతి ఎ. లక్ష్మిగారు
9. కుమారి సి. గజలక్ష్మిగారు
10. డా. ,, లలితా చెంచయ్యాగారు
11. డా. ,, సి. కమలాదేవిగారు
12. శ్రీమతి కె. గోమతిగారు
13. శ్రీమతి ఎస్. కమలంగారు
14. శ్రీమతి శోభ సుబ్బయ్యాగారు
15. శ్రీమతి బి. హేమలతాదేవిగారు
16. శ్రీమతి శకుంతలా కృష్ణమూర్తిగారు
17. శ్రీమతి భీమవరపు సరస్వతమ్మగారు
18. శ్రీమతి పర్వతనేని లక్ష్మీపద్మావతి గంగాధర్‌గారు
19. శ్రీమతి మట్టపల్లి చంద్రమ్మగారు
20. శ్రీమతి ఎమ్. రాజ్యలక్ష్మి శాయికృష్ణగారు
21. శ్రీమతి పరిమి లక్ష్మిగారు
22. శ్రీమతి అనుమోలు ఇందిరాదేవిగారు
23. కుమారి ఆర్ ఉమాదేవిగారు
24. కుమారి ఆర్ ఊర్మిళామాలుగారు
25. శ్రీమతి రాచమడుగు వెంకటరత్నమ్మ
26. కుమారి పందిరి శాంతాబాయిగారు
27. శ్రీమతి ఎ కె ఆర్ లక్ష్మిగారు
28. శ్రీమతి ఎ దుర్గాంబగారు
29. శ్రీమతి చంద్రా పద్మనాభన్‌గారు
30. శ్రీమతి ఎమ్ ఎస్ బాలంగారు
31. శ్రీమతి పార్వతీ కృష్ణమూర్తిగారు
32. డా ,, జయలక్ష్మిరావుగారు
33. శ్రీమతి చంద్రా మురుగేషన్‌గారు

# ఆంధ్ర మహిళా సభ - మద్రాసు

## దసరా విరాళములు

| | |
|---|---|
| శ్రీమతు శివలంక కామాక్షమ్మగారు | 101.00 |
| ,, కె. రామకృష్ణ | 100.00 |
| ,, గోగినేని సరోజినీదేవిగారు | 100-00 |
| ,, చిర్ల బాలామణిగారు | 100.00 |
| ,, మీర్జాపూర్ రాణిగారు | 100.00 |
| మొత్తము | 501.0.0 |

| | |
|---|---|
| శ్రీమతి ధనలక్ష్మి సుందర్ లాల్ | 50-00 |
| ,, వి. లక్ష్మీ పార్వతిగారు | 35-00 |
| ,, రాజ్యలక్ష్మి ప్రసాదుగారు | 30.00 |
| ,, వై. భవానీ దేవిగారు | 30.00 |
| ,, కె. లక్ష్మీరఘురామ్ | 25.00 |
| ,, తూములూరి కమలమ్మగారు | 25.00 |
| ,, ఎమ్. ఎస్. సుబ్బలక్ష్మి | 25.00 |
| ,, చిర్ల పుష్పవేణిగారు | 25.00 |
| ,, కె. శేషుగారు | 25.00 |
| ,, చిర్ల కమలాగారు | 25.00 |
| ,, నిత్యానందము | 25-00 |
| ,, కమలా ప్రసాదుగాదు | 20.00 |
| ,, ఇ. బి. విశాక్షిగారు | 20.00 |
| ,, పప్పట్ లాల్ శకుంతలాదేవి | 15.00 |
| ,, సుశీలా సంబంధం | 15.00 |
| R. R. I. I. పార్టుటైమ్ విద్యార్థినులు | 13-50. |
| మొత్తము | 399.50 |

### 10. రూ॥ ఇచ్చిన వారి పేర్లు

శ్రీమతులు లలితా రాజామణిగారు, టి. జి. పుష్ప, పి. ఇందిరాదేవి, కె. లీలారాణి, ఎ. జమునా సింహా, పి. సంపూర్ణమ్మగారు, పి. అన్నపూర్ణమ్మ, వి. అనసూయ, కమలా వీరరాఘవులు, ఎ. పర్వతవర్ధనిగారు, సీతా నాయుడమ్మ, ఎమ్. సూర్యకాంతం, ఆర్. రుక్మిణమ్మ, కనక దుర్గాంబ, వై. రాజమ్మ, సుందరీ రాజన్, టి. విశాలాక్షి, దుర్గాబాజీ, పి. శకుంతలమ్మ, ఆర్. సరోజారెడ్డి, బి. లీలా నాయుడు, దుర్గాంబగారు, డా॥ ఎమ్. పవనాబాయి, పుష్పావతి చౌదరి, ఎ. లక్షులమ్మగారు, ఇందిరా పెరిందేవి, పి. సూర్యనారాయణ, ఎమ్. వరలక్ష్మి. వి. శ్రీదేవమ్మ, కమలా కేశవరావు.

మొత్తము 300.00

### 5 రూ. యిచ్చిన వారి పేర్లు

హిలారి, శకుంతలా వేణుగోపాలగారు, టి. సుశీలాదేవి, వి. రాజ్యలక్ష్మి, హెచ్. కె. మూర్తి, టి. జి. హైమావతి, ఎ. సర్వస్వతి, వెంకుబాయమ్మగారు, ఆర్. కమలాబాయి, సి. పి. జానకి, పి. రామచంద్రన్, సదయాలి, ఎ. లక్ష్మీకుమారి, ఎన్. సిరోమణి, ఎమ్. ఎమ్. ప్రమీల. కుసుమ్ కపూరు, సుమన్ కపూరు, రేవతి, కె. పొన్నమ్మ. వి. శ్రీమతి. ఊర్మిళా, ఎన్. విజయలక్ష్మి, ఎస్. సరోజిని, వై. మంజుల,

ఆర్. లక్ష్మి, ఆర్. ప్రభావతి, ఎమ్. హంసవేణి. ఎ. లలిత, ఎస్. భాగ్యలక్ష్మి, చీలంకి వెంకుబాయిగారు, శ్రీమతి జనార్దన్, వి. సుభద్ర, కె. రంగనాయకమ్మ. పి. సుందరమ్మ, ఆర్. సూర్యనారాయణమ్మ, పి. వెంకుబాయమ్మ.లి ధనశీ సిల్వ. స్వర్ణమ్మగారు, బి. కృష్ణవేణమ్మగారు. వి. యశోదగారు, భ్రమరాంబగారు, సి. కమలాదేవి, విజయలక్ష్మి చంద్రశేఖరు, రాధ కృష్ణస్వామి, నళిని, టి. అహల్యా సంతానము, శివగాము పిళ్ళయ్, కె. ఆర్. అంబుజ, డా॥ ఇ, కమలాదేవి, డా॥ వేదమానిక్యం. డి. సులోచన, వి. జలజ. వి. రంగ, డా॥ లలితా చెంచయ్య, పి. ఎమ్. రామలింగము, డి. వీరలక్ష్మి. డి. శ్యామల, జి. లక్ష్మీకాంతమ్మ, రామలక్ష్మి ఆరుద్ర, అశ్వనీ కుమారి, ఆంధ్ర యూనివర్సిటీ ప్రొఫసర్. సావిత్రి. బి. గీతా ప్రేమా, టి. కృష్ణవేణి, ఎస్. కృష్ణమూర్తి, శోభా సులభ,

మొత్తము రూ. 325.

## 4- రూ॥ యిచ్చిన వారి పేర్లు

ఎమ్. భారతి దేవి, ఎస్. విజయ లక్ష్మి. కె. కామేశ్వరి,

మొత్తము రూ॥ 12

## 3-రూ॥ యిచ్చిన వారి పేర్లు

సుందరీ శంకరము, ఎ, ప్రేమ, టి. ప్రమీల, ఆర్. జగదాబాయి, కె. భగీరథీ. సుదర్శని, ఆర్. రామలాల్‌షా, ప్రమీలా పారేఖ్, టి. కల్పకము, ఎమ్. జి. అనసూయ, ఎస్. అరుణ కుమారి, సి. హెచ్. సావిత్రి, ఆర్. ఎస్, శివకామి, ఎ. అనసూయ, వి. కృష్ణవేణి, ఎస్. శేషమ్మ, జి. రాసమణి, సి. హెచ్. పద్మావతి, ఎమ్. రామాయమ్మ, డి. వి. సునందని, పి. చంద్రకళ.

మొత్తము 63- రూ.

## 2- రూ. ఇచ్చిన వారి పేర్లు

జి. సావిత్రి, బి. సుశీలా దేవి, శ్యామల సుందర్, ఉస్మాన్‌గలి, పి. ముని రత్నము, కె. త్రిపురవాణి, లతజోగ్, సి. గీత, ఆర్. ఉమ, కె. శ్యామల ఆర్. సుందర వల్లి, జి. కమల, జి. సరస, ఎ. సరస్వతి, ఆర్. లక్ష్మి, బి. సత్యవతి, ఎస్. అనసూయ, ఆషాకట్టర్, సురేఖాణ, కె. లక్ష్మి, ఆర్. మాలతి. సి. కఖారా. నైనా జేకాతారా, కె. ఇందిర, కె. విజయలక్ష్మి, కె. సరసమ్మ. డి. పద్మావతి జి. రత్న కుమారి. ఎ. ఆర్. హేమలావన్య, అమితా, మున్నాణబేగమ్, కె. సరోజిని, వి. పద్మావతి, కె. శారద, ఎం. జయలక్ష్మి. రోహిణి, ఎస్. శాంతి, ఎం. రామకుమారి, అరుణ మిత్ర. ఎస్. సరస్వతి. బి. నాగేస్వరమ్మ, ఎస్. ధనలక్ష్మి జై, సుకన్య, పి. బి. శకుంతలమ్మ, టి. సుమతి, ఎల్. కణ్ణన్. పి. పెరుమాళ్, సుశీల. సుగుణ, పి. ప్రమీల.

మొత్తము 100 రూ.

## 1. రూ. యిచ్చిన వారి పేర్లు.

జి. భారతి, సి. వైజయంతిమాల. సి. చంద్రలేఖ, ఆర్. జమున, యు. సీత, వసంత, కె. అనురాధ, డి. యు. వసుమతి, కె. సీత, హస్తా లంబిక, విశాలాక్షి, డి. సరోజిని. సి. శాంత సామ్రాజ్యమ్, ఎం. ఎస్. కమల, మేరీ స్టెలా, భార్గవి, ఎం. సవిత, బి. శ్యామల, పి. సుమతి, కె. కె. భారతి, కమల, బి. మాలతి, జి. లీలా, సిందియా డార్, ధవిమావతి, వి. ప్రమీల, బి. రాజేశ్వరి, ఎం. హేమలత, కె. ఉష, యు. సరస్వతి, పూర్ణిమ మల్‌హోత్ర, దుర్గాభవాని, ఆర్. ఆర్. వేదప్రియ, టి. యు. రాధ, వి. అంబుజము, బి. బి. సోగులార, ఎస్. అంబుజ, వై. సరోజ, కె. విమల, పి. ఉషారాణి, సి. హెచ్. సావిత్రి, ఆర్. కస్తూరి, ఆషా కుమారి, ఆర్. రాజేశ్వరి, ఆర్. రాధ, యు. రమామణి, సి. జి. ఇందిర, ఆర్. నిర్మల, ఆర్. కె. కళ్యాణి, వి. మీనాక్షి,

డి. మంగళము, ఎం. జ్ఞానకాంతం, ఎస్. చెల్లకన్నమ్మ, కనకదుర్గ, టి. యశోద, డి. కమలమ్మ కె. గంగూబాయి, లీలావతి, ఎం. సత్యవతి, కులశేఖరమ్మ, డి. లేంబూ అయ్యరు, పి. సుశీల, శ్రీమతి ఆర్. మార్టిన్, కె. సుశీల, పి. జెంబునాధమ్, జ్ఞానేశ్వరి, కె. ఎస్. సింగారి అమ్మ, శ్రీ కె. అంసావతి, ఎస్. ఎన్. రత్నావతి, ఎస్. మీనాక్షి, శ్రీ రామామూర్తి, శ్రీమతి చంద్రజోషి, డి. హన్‌సా, మంజుల, ఎల్. రుక్మిణి, డి. అనసూయ, ఎస్. సుశీలాబాయి, జి. ఎస్. లీలాబాయి. జి. రంగ భాష్యము, సుమతీ కుమారి.

మొత్తము 82 రూ.

## 50. న. పై. యిచ్చిన వారి పేర్లు

టి. వి. ప్రమీల, సీతాలక్ష్మి, కె. రాజమ్మ, ఎ. మోహనాంబ, ఆర్. మేరీ, ఎస్. ముత్తులక్ష్మి, ఎస్. సరోజ, ఎస్. జయలక్ష్మి, ఆర్. భాగ్యమ్మాల్, ఎస్. అన్నశోభితమ్, ఎస్. వసంత, కె. విరుదాంబాళ్, ఇ. ఎమ్. రాజీబాయి, రోలన్ తెరిసా, ఎస్. అనసూయ, కె. ఎస్. భారతి, కె. శంఖరి. ఎ. పి. దేవకికుట్టి, ఎం. సి. మేరీకుట్టి, ఎం. సి. హెలన్, తంగమ్మ, ఎల్. పద్మావతి, వి. పి. రాధ, మన్యమ్మ, ఎస్. సి. చారుశీల, జి. కృష్ణలీల, లోకాంబాళ్,

మొత్తము 13-50 న. పై.

R. R. i. i. స్టూడెంట్సు, ఫుల్ టైంమ్ వాళ్ళు. (విద్యార్థినులు)

| | | |
|---|---|---|
| | | 7. న. పై. |
| 100 రూ. ఇచ్చిన వారి మొత్తము | | 400-0.0 |
| 101 ఇచ్చిన వారి మొత్తము | | 101.0.0 |
| | రూ. | 501.00 |
| | ,, | 399.00 |
| | ,, | 300-00 |
| | ,, | 325-00 |
| | ,, | 12.00 |
| | ,, | 63.00 |
| | ,, | 100.00 |
| | ,, | 82.00 |
| | ,, | 13.50 |
| | ,, | 7.50 |
| మొత్తము- | | 1803-50- న. పై. |



శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ ఆధ్వర్యాన భారత ప్రభుత్వం నేషనల్ కౌన్సిల్ ఫర్ విమెన్సు ఎడ్యుకేషన్ నెలకొల్పింది. యి కౌన్సిల్ ప్రథమ సమావేశానికి డాక్టర్ కె. ఎల్. శ్రీమాలీ అక్టోబరు 16 తేదిన ఢిల్లీలో ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంలో తీసిన ఛాయా చిత్రం.

ఆంధ్ర మహిళాసభ - హైదరాబాదు

# దసరా విరాళములు

| | రు. | న పై |
|---|---|---|
| ఒక శ్రేయోభిలాషి | 100 | 00 |
| హాస్టలు ట్రయినీసు | 55 | 00 |
| శంభూలాల్. కో. (వస్తురూపముగ) | 37 | 00 |
| శ్రీ ఆర్. బ్రహ్మయ్య, వి పెద్ద సుబ్బరాజు చెరి రు 25- | 50 | 00 |
| జి జి ఎయిరే, ఏ గోపాలకృష్ణయ్య, కే లింగాధరరావు చెరి రు 20- | 60 | 00 |
| శ్రీమతి శ్యామలాదేవి | 16 | 00 |
| శ్రీమతి కే మాణిక్యాంబ, జి తిమ్మాబాయి, కోపరేటివ్ మిల్కు సొసైటి చెరి రు 15- | 40 | 00 |
| శ్రీమతి పట్టాభిరామారావు, డాక్టర్ కుమారి కృతకీర్తిగారు, ఇ వెంకటేశ్వరరావు, డి మహాలక్ష్మి, శ్రీమతి అనంతబాబు, శ్రీ రుక్మాజీధర్మ, శ్రీమతి షరీవ్ - యున్నిస్ కాసిమ్ శ్రీ యన్ యస్ రాజన్, సి టి శాస్త్రి, శ్రీమతి బి సుబ్రమణ్యం. ఎస్. ఎన్ సెగల్, శ్రీమతి ఎన్ శాంతమ్మ, వి పెరుమాళచెట్టి, అండ్సన్సు, బాంబేకేన్ హౌస్ బాంబే, వీరు చెరి రు 10- | 140 | 00 |
| శ్రీ యస్ వి రామయ్య, శ్రీమతి నారాయణమ్మ, గో వి ఈశ్వరమ్మ, (హా జి జకరయ్యా హా జి ఇబ్రహీం), వి రంగనాథం, ఇ మయూరాక్షి, బి మైత్రా, జి శ్రీనివాసరావు, సి, అనంతరావు శ్రీమతి టి జి హైమావతి, వై లలిత సత్య దయాభాను, షైర్ఫుడ్షావు, ఏ జయప్రదాదేవి వీరు చెరి రు 5- | 75 | 00 |
| వి ఊర్మిల | 4 | 00 |
| కె ఇందిర జి వెంకుబాయమ్మ, భారతకిరాన్ స్టోర్సు, బాలమ్మ వీరు చెరి రు 3- | 12 | 00 |
| లక్ష్మీబాయమ్మ, పి ఇందిర వీరు చెరి రు- 2 | 4 | 00 |
| మొత్తం విరాళాలు- | 598 | 00 |

పై విరాళములు కాక శ్యామాప్రింటింగు ప్రెస్సు వారు దసరా ఆహ్వాన పత్రికలను అచ్చొత్తించి ఇచ్చారు

మాతృసంస్థ ఆంధ్ర మహిళాసభవారు ఈ దసరా సందర్భంలో రు 500 ఖరీదుచేసే మైక్రోఫోను, ఏంప్లిఫైర్, రెండు స్పీకర్లు, స్టాండ్, 8 జంపకానాలు హైదరాబాదు బ్రాంచికి ఇచ్చారు, వీరికి మా కృతజ్ఞత.

## ఆంధ్ర మహిళాసభ, దసరా వేడుకలు

# ఆటలపోటీలు ; బహుమతులు

**I. Observation Game**

I. Prize కుమారి సత్యవతీ సింగం.

II. Prize ,, లతాజోగ్

**II. Skipping**

I. Prize ,, ఎమ్. సవిత

II. Prize ,, జి. ప్రమీలారాణి

**III. Musical Chairs**

I. Prize ,, ఆషా ఖట్టర్

II. Prize ,, ధనశీలీ సిల్వా

**IV. Farmer and Beans**

I. Prize ,, ఎమ్. జయలక్ష్మి

II. Prize ,, ఎమ్. సవిత

**V. Running Relay Team I**

1. ఎమ్. జయలక్ష్మి 2 జి ప్రమీలారాణి 3. సి. వైజయంతీమాల 4. ఆర్. టి. సుకన్య 5. కె. ఉష 6 పలుస్నే ఆరాబిగం

ఉద్యోగులకు ఆటలు :

**VI. Observation Game**

I. Prize కుమారి జి. భారతి

II. Prize ,, ఎ. సరస్వతి

,, జి సావిత్రి

శ్రీమతి బి. సుశీలాదేవి

**VII. Slow Race**

I. Prize శ్రీమతి కమలాదేవి

**VIII. Ring Tennis**

I. Prize నాగరత్నం

కన్యకాపరమేశ్వరి

Smt. Durgabai Deshmukh'
Prize for Proficiency.

బెనారసు అడ్మిషన్ సీనియర్ తరగతి :

కుమారి బి. శ్యామల

ఆంధ్రా మెట్రిక్యులేషన్ సీనియర్ తరగతి :

కుమారి ఆర్. లక్ష్మి

నర్సింగ్ కోర్సు : పి. కమల

రాణీరాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయం

శ్రీమతి టి. కె. ఎమ్. మీనాక్షి

శిశువిహార్ : బేబీ గిరిజాకుమారి

**ENTERTAINMENTS.**

1. ఒప్పత్తినొప్పం (మళయాళ నాటిక)
   **I. Prize** మన్నుఅమ్మ
2. మందు మరవట్టెయి (తమిళ నాటిక)
   **I. Prize** కుమారి ఆర్. సౌందరవల్లి
3. పెళ్ళి కంట్రోల్ (తెలుగు నాటిక)
   **I. Prize** కుమారి ఎన్. విజయలక్ష్మి
4. గ్రామలక్ష్మి (తెలుగు నాటిక)
   కుమారి కె. దుర్గాభవాని
5. త్యాగి (హిందీ నాటిక)
   **I. Prize** కుమారి లతాజోగ్
6. వీర్ రాజకుమార్ (హిందీ నాటిక)
   **I. Prize** కుమారి ఎన్. టి. లీలాపతి
7. శెలవుల్లో (తెలుగు నాటిక)
   కన్యకాపరమేశ్వరి
8. Poet's Dream (ఆంగ్ల నాటిక)
   డాక్టర్ అంబుజం
9. అందో పాడగ (తమిళ నాటిక)
   కుమారి జలజాక్షి
10. డాక్టర్ ఛిమ్ ఛీమ్ హవా (ఆంగ్ల నాటిక
    కుమారి ఆర్. చంద్రలేఖ

ఉత్తమ నాటికకు రోలింగ్ కప్పు

త్యాగి (హిందీ నాటిక)

# ఆటల పోటీలు - బహుమతులు

విచిత్ర వేషధారణ :

I. Prize పల్లెదంపతులు అరుణ, నళిని

II. Prize మరాఠీ జెస్సకత్తె

III Prize వసంతా జేకబ్

గోదీ : జి. పాపాయమ్మ

గాత్రం : శ్రీమతి అనసూయాదేవి, సీతాదేవి
శ్రీమతి మీనాక్షి వైద్యనాధన్

నృత్యం : కుమారి ఎమ్. చిత్ర.
కుమారి రంగా & Party

ఇతర బహుమతులు :

ఆంధ్ర మహిళాసభ నర్సింగ్‌హోమ్ వారు ప్రదర్శించిన Boat Song, మరియు టాబ్లోకు

శ్రీ నాగేశ్వర్ శిశువిహారు, అర్బన్ వెల్‌ఫేర్ ప్రాజెక్టు, పిల్లలకందరికీ బహుమతులు పంచి పెట్ట బడినవి.

వాసవదత్త, (Dance Drama)

వాసవదత్త : కుమారి గజలక్ష్మి

ఉపగుప్తుడు : ,, లక్ష్మి పున్నమ్మ

Narrators : కుమారి ఎస్. వాణి, జి. ప్రమీలారాణి

ఇతరులు : ఎమ్. జయలక్ష్మి ఎమ్ హంసవేణి, జమునాసింహా, ఎస్ సత్యవతి, బి. వి. రాజ్యలక్ష్మి, ఆర్. రాజేశ్వరి, ఎమ్. చిత్ర, సి. నళిని, వి. నళిని, ఆర్. సౌందర్యవల్లి, ఎ. సరోజ, సుమన్ కపూర్, జె. జ్యోత్స్న, సి. శాంత, ఎన్. విజయలక్ష్మి, కె ఇందిర

లలితాకళా ప్రదర్శనలో పాల్గొన్న సంస్థలు :

స్త్రీ సేవామందిర్
మద్రాసు సేవాసదన్
స్త్రీ సదన్
స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్
మద్రాసు రాష్ట్ర సంక్షేమ సంస్థ
రాణీ రాజ్యలక్ష్మి పారిశ్రామిక పాఠశాల
ఆంధ్ర మహిళాసభ
నర్సింగ్‌హోమ్
మల్లమ్మదేవి హాస్టల్
ఆంధ్ర మహిళా ప్రెస్
ఆంధ్ర మహిళాసభ, హైదరాబాదు
అంబర్ విద్యాలయ
పాండుచేరి స్టేట్ సోషల్ వెల్‌ఫేర్ బోర్డు
చంగల్పట్టు ఉమెన్సు వెల్‌ఫేర్ డిపార్టుమెంటు
సి. ఐ. డి. (మైలాపూరు)

ఈ సంస్థ లన్నింటికి బహుమతులు పంచడమైనది.



*

# వార్తలు - విశేషాలు

## "నకిలీ మానవులు" అమెరికా అపర బ్రహ్మల సృష్టి !

పరమాణుశక్తి వల్ల మానవులమీద ఏయే ఫలితాలు కలుగుతాయో పరిశీలించటానికి అమెరికాలో "ప్లాస్టిక్ మనుషుల్ని" సృష్టించారు. పరమాణు సంబంధమైన కొన్ని పరీక్షలకు ప్రాణాలమీద ఆశ ఉన్న మానవుడెవడూ అంగీకరించడు. కనుక ఈ ఈ ప్లాస్టిక్ మనుషుల సృష్టివల్ల ఈ పరీక్షలు ఎవరి మీద జరపట మనే సమస్య పరిష్కారమైంది. మానవ శరీరానికి పరమాణుశక్తి సోకటం వల్ల ఏమి జరుగుతుందో ప్రయోగాలు చేసి చూడటానికి ఈ కృత్రిమ మనుషులు సిద్ధపడుతున్నారు. చూడటానికి వీళ్లు తమాషాగా ఉంటారు. అయితే వీరి వల్ల అసలు మానవులకు ఎంతో మేలు జరుగుతుంది.

ప్రమాదవశాత్తు రేడియేషన్‌కి ఎవరైనా గురైనప్పుడూ, వైద్యం చేసే సందర్భంలోనూ, అంతరిక్షంలో పయనించే టప్పుడు- ఇట్లా ఎప్పుడైన పరమాణుశక్తికి గురై తక్షణమే తన్నివారణకి ఏమి చేయాలో శాస్త్రజ్ఞులు కనిపెట్టటానికి ఈ నకిలీ మనుషులు ఉపయోగ పడతారు.

ప్లాస్టిక్ గొట్టాలను సరిగా మానవాకృతిలో మనిషి అంత సైజులో తయారు చేస్తారు. మానవ హస్తి పంజరం ఒక చిప్పలో అమరుస్తారు. రెండు ప్లాస్టిక్ ఊపిరి తిత్తులు పెడతారు. కొన్ని బోలు ప్లాస్టిక్ గొట్టాలలో ఒక రసాయనిక ద్రవం నింపుతారు. ఈ గొట్టాలలో రక్తనాళాల వలె ఉంటాయి. మృదువైన మానవ కండరాలకు పరమాణు రేడియేషన్ సోకితే అవి ఎట్లా ప్రక్రియిస్తాయో ఈ ద్రవం అట్లానే చేస్తుంది. అవి ఉండే అతన్ని రెమాబ్ రేడియేషన్- ఈక్వివలెంటు_మ్యాన్, అబ్సార్షన్ మరొక అతన్ని రెమ్‌కల్ (రేడియేషన్ ఈక్వవలెంటు మ్యాన్, కాలిబ్రేషన్) అంటారు. ఇతని శరీరంలో లివరు (కాలేయం) స్లీసు (గుల్మము) కిడ్నీలు (మూత్రపిండాలు), ఊపిరి తిత్తులు, థైరాయిడ్ గ్రంధిని బోలిన ప్లాస్టిక్ నమూనాలు చేసి అమరుస్తారు. వీటి అన్నిటినిండా రేడియేషన్‌కు వెళ్ళగ్రక్కుతూ ఉండే ఒక రేడియో ధార్మిక ద్రవం నింపుతారు.

న్యూ మెక్సికోలో లాసు అలమోసు సైన్సు లేబరేటరీ కోసం ప్రత్యేకంగా సృష్టించిన ఈ నకిలీ మనుషులు ఇద్దరూ అనేక ప్రయోగాలలో ఉపయోగ పడుతున్నారు వీళ్ళలో రెమాబ్‌ను వివిధ ప్రమాణాలలో రేడియేషన్‌కి గురిచేస్తున్నారు. ప్రతిసారి ఇట్లా గురిచేసిన మీదట ఒక కొలమానం ద్వారా మొత్తం శరీరం ఎంత రేడియో ధార్మికతను పీల్చుకొన్నదీ కొలుస్తారు. ఇంకా భాగాలలో ఎంతెంత రేడియో ధార్మిక శక్తి చేరిందీ చిన్ని కొలమానాలతో కొలుస్తారు. ఇక రెమ్‌కల్ అనే రెండవ అతనిని శరీరంలో ప్రతిభాగంలోని నింపి ఉన్న ద్రవం నుంచి వెలువడే రేడియేషన్ కొలవటానికి ఉపయోగిస్తారు. ఈ కొలతల వల్ల మానవ శరీరంలో ఎంత రేడియేషన్ ఇముడుతుంది? అది ఏమి చేస్తుంది? అనే అంశాలను పరిశీలిస్తారు.

ఈ నకిలీ మనుషుల మీద చేస్తున్న ప్రయోగాల ద్వార రేడియేషన్‌ని గురైన అసలు మానవులకు తక్షణవే సరైన చికిత్స చేయటంలో ఉపయోగపడగల ఎంతో కొత్త సమాచారం శాస్త్రవేత్తలకి లభిస్తున్నది. ఎముకలకు గాని, అవయవాలకు గాని, కండరాలకు గాని ఒక ప్రమాణంలో రేడియేషన్ సోకినప్పుడు ఏమి జరిగేదీ ఈ ప శీలన ఫలితాలను బట్టి స్పష్టంగా అంతుబడుతుంది గన్క చికిత్స చేయటానికి ఇక కావలసి ఉండేది- దానికి గురై శరీరంలో ఎంత రేడియేషన్ ఉన్నదని మాత్రవే మొత్తం శరీరంలో ఉండే రేడియేషన్‌ని కొలిచే మా కంలో ఆ రోగిని ఉంచి ఎంత మొత్తం రేడియేషన్ అతనిలో ఉన్నదీ తెలుసుకోవచ్చును. అప్పుడిక ఆ రేడియేషన్ సోకుడు వల్ల శరీరంలో ఏ భాగాల ముందుగా హెచ్చు ప్రమాదం ఉంటుందో ఆ భాగాల చికిత్స చేయవచ్చును. ఈ నకిలీ మానవుల వల్ల ఇ మీద ఊహా జనిత ఆలోచనల మీద ఆధారపడవలసి

అవసరం తప్పుతుందని ఈ లాసు అలమోసు లేబరేటరీ శాస్త్రజ్ఞులు నమ్ముతున్నారు. అంతే గాక పరమాణు శక్తి వల్ల మానవునికి కలిగే దొసగులనుంచి అతనిని తక్షణమే కాపాడటానికి చాల పటుతరమైన మార్గాలు లభించగల వని ఆశిస్తున్నారు

ఇది నకిలీ మానవుల వల్ల అసలు మానవులకు కలిగే మేలు.

♦ ♦ ♦

## అనువాదక యంత్రాలు!

సోవియటు శాస్త్రజ్ఞులు, ఒక భాష నుండి రచనలను యింకో భాషలోకి అనువదించడానికి యంత్రాలను తయారు చేయడం గూర్చి కృషి చేస్తున్నారు. ఈ యంత్రాలు తయారయినట్లయితే వివిధ శాస్త్ర విజ్ఞాన, ఇంజనీరింగ్ శాఖలలోని విదేశ సారస్వతాన్ని త్వరగా అనువదించడం సాధ్యమవుతుంది. 1955 లో మొదటి సారిగా సోవియట్ దేశంలో, ఎలక్ట్రానిక్ కంప్యూటింగ్ యంత్ర సహాయంతో ఇంగ్లీషు నుండి శాస్త్రవిజ్ఞాన, సాంకేతిక రచనలను రష్యన్ భాషలోకి అనువదించ డంలో తొలి ప్రయోగం జరిగింది. చైనీస్, జర్మన్, జపానీస్ భాషల నుండి రష్యన్‌లోకీ, రష్యన్ నుండి విదేశ భాషలలోకి యంత్ర సహాయంతో అనువాదం చేసే పద్ధతులు యిప్పుడు రూపొందించబడుతున్నాయి. ఈ యంత్రాలు త్వరలో నిర్మించబడతాయి.

♦ ♦ ♦

## వజ్రాల పుట్టుక

వజ్రాలు మామూలు బొగ్గు నుండే తయారవుతాయనీ, కాని యీ బొగ్గు ప్రత్యేకమైన రూపంలో వుంటుందనీ అందరికీ తెలిసిన సంగతే. ఈ బొగ్గు వజ్రంగా ఎలా మారుతుంది? భూమిపై పోర్ నిర్మాణం గురించీ, అగ్ని పర్వత ప్రమేయంగురించీ అనేక సంవత్సరాలు పరిశోధన సాగించి ప్రొఫెసర్ అషాట్ అస్లాన్‌యాన్ అనే ప్రఖ్యాత ఆర్మీనియన్ భూగర్భ శాస్త్రజ్ఞుడి యిటీవల ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించేసు వజ్రంగా మారే బొగ్గు అగ్నిపర్వత ప్రమేయం నుండి పుద్భవించినదని యీ శాస్త్రజ్ఞుడు భావిస్తున్నాడు,

భూగర్భంలో. బహుశా ప్రేలుడు జరిగినప్పుడు, వాయువు విడుదల యేటప్పుడు, అత్యధిక ఉష్ణోగ్రత క్రిందనూ అత్యధిక ఒత్తిడి క్రిందనూ — అంటే వాతావరణపు వత్తిడికే ఒక లక్షలేక రెండు లక్షల రెట్ల వత్తిడి క్రింద — ఏసిటిలైన్‌గ్యాస్ నుండి బొగ్గు వజ్రంగా మారుతుంది.

♦ ♦ ♦

## మట్టి ఇటుకలో భద్రపరచిన పుస్తకం

ఇటీవల ఉజ్బెకిస్తాన్‌లో భూగర్భ పరిశీలనలు జరుపుతున్న శాస్త్రజ్ఞులకు ఒక మట్టి ఇటుక దొరికింది. అందులో మందంగా వున్న కాగితాలు కొన్ని వున్నాయి. లెనిన్ గ్రాడులోని సాల్టికోవ్ షెడ్రిన్ గ్రంథాలయానికి చెందిన లిఖిత పత్ర నిభాగానికి యీ ఇటుక పంపబడింది. ఈ గ్రంథాలయంలో వుద్యోగులు చాల నెలల పాటు శ్రమ పడి జాగ్రత్తగా యీ ఇటుకలోని కాగితాలను బయటికి తీశారు ఈ "విజ్ఞాన గ్రంథం" ఒక మహత్తరమైన పాచీన లిఖితగ్రంథం. 12 వ శతాబ్దానికి చెందిన తత్వ వేత్త. కవి అయిన అహ్మద్ ఎసావీ యీ గ్రంధాన్ని రచించారు. ఈ ఇటుకలో భద్రపచబడిన యీ గ్రంథం 18 శతాబ్దంలో తయారు చేయబడిన లిఖితప్రతి అని తెలుస్తుంది.

♦ ♦ ♦

## ఎలక్ట్రిక్ కార్లు

ఎలక్ట్రిసిటీలో నడిచే మోటారు కార్లను తయారు చేయడానికి కనీసం మూడు కంపెనీలు ప్రయత్నిస్తున్నాయి. అమెరికాలో. వాటిలో ఒకటైన స్టిన్సన్ ఎయిర్ క్రాఫ్ట్‌టూల్ కంపెనీ అప్పుడే ఒక కారును తయారు చేసింది.

ఇది కాలిఫోర్నియాలో తిరుగుతున్నది కూడా. దీనిలో ముందు సీటులో ఇద్దరు పెద్దవాళ్ళు, వెనక సీటులో ఇద్దరు పిల్లలు కూర్చోవచ్చు. లైటు వెయిటు బ్యాటరీల నుంచి జనించే 48 వోల్టుల ఎలక్ట్రిసిటీతో ఈ కారు నడుస్తుంది.

బ్యాటరీల బరువు 528 పౌనులు. ఇది అతి వేగంగా వెళ్లినప్పుడు గంటకు 58 మైళ్ళ వేగంతో వెడుతుంది. అయితే, సుమారు ప్రతి 100 మైళ్ళకు ఒక సారి చొప్పున బ్యాటరీలను రీఛార్జి చెయ్యాలి. మామూలు గోడ ప్లగ్గునుంచి బ్యాటరీలకు తీగ తగిలించి, ఏడు గంటల సేపు అట్టేపెడితే బ్యాటరీలు తిరిగి ఛార్జి అవు

తాయి. రాత్రులలో ఈ పని చేసుకొని, పగలు తిరుగుతూండవచ్చు. ఒకసారి రిఛార్జి చేసినప్పుడల్లా అరగేలను పెట్రోలు కయే ఖర్చు అవుతుంది.

1960 లో ఇటువంటి 2000 కార్లను తయారు చెయ్యాలని స్టిన్సన్ కంపెనీ యోచిస్తూంది.

♦ ♦ ♦

## రేడియో తరంగాల ద్వారా కీటక సంహారం

అమెరికా వ్యవసాయ శాఖకు చెందిన శాస్త్రవేత్తలు రేడియో తరంగాల ద్వారా ధాన్యాదులకు పట్టే క్రిమి కీటకాలను కొలది సెకండ్లలో సంహరించే పద్ధతి కని పెట్టారు. ప్రపంచ మంతటా ఈ పురుగుల వల్ల ప్రతి యేటా జరుగుతున్న నష్టం ఇంతింత కాదు. వీరు జనింప చేసిన రేడియో ఫ్రీక్వెన్సీలు 60 నుంచి 66 డిగ్రీల సెంటిగ్రేడ్ ఉష్ణాన్ని పలిగిస్తాయి. ఈ వేడికి క్రిమి కీటకాలు మరణిస్తాయి; ధాన్యాలను చెడగొట్టేటంత వేడి కాదు ఇది. ఈ పద్ధతిని అందరూ అనుసరించే ఏర్పాట్లను వ్యవసాయశాఖవారు చేస్తున్నారు

♦ ♦ ♦

## తుప్పులో ఉన్న గొప్ప

లోహపు వస్తువులు, యంత్రాలు తుప్పు పట్టకుండా ప్రతి దేశంలో పరిశ్రమలు విపరీతంగా శ్రమపడు తూంటే, అమెరికాలో తుప్పునే తయారు చేస్తున్న కంపెనీ ఒకటుంది. దానిపేరు జనరల్ సిరామిక్స్ కార్పొరేషన్ (కీస్బీ, న్యూజెర్సీ).

ఈ కంపెనీ ముఖ్యంగా ఫెరైట్ పదార్థాన్ని- అంటే తుప్పును- తయారు చేస్తుంది. దీనిలో హెచ్చుగా ఉండేది ఐరన్ ఆక్సయిడ్. దీనిని టెలివిజన్ సెట్లు, రేడియోలు, ఎలక్ట్రానిక్ కంప్యూటర్లు, రాడార్ పరికరాలు మొదలైనవి తయారు చేయడానికి ఉపయోగిస్తారు.

♦ ♦ ♦

## లోహాలంత గట్టిగా ఉండే ప్లాస్టిక్ వస్తువులు

లోహాలకు బదులుగా అనేక వస్తువులను తయారు చేయడానికి వీలైన గట్టి ప్లాస్టిక్ పదార్థాన్నొకదానిని డ్యూపాంటు కంపెనీవారు తయారు చేశారు. దీనిపేరు డెర్లిన్. ఇంతవరకు ప్లాస్టిక్‌లలో ఇంత గట్టిదిలేదు. తలుపు పిడులు, మోటారు కారుల డాష్ బోర్డులు, పంపులు మొదలైన 500 రకాల వస్తువులను దానితో తయారు చేయవచ్చు.

అయితే, లోహాల అవసరం లేకుండా ఇది చేయ లేదు. ఎందుకంటే దీనిని అతకడం కష్టం; అల్ట్రావయొలెటు కిరణాల వల్ల, ఈ పదార్థంతో తయారు చేసిన వస్తువుల రంగులు పోతాయి.

♦ ♦ ♦

## "అమెరికన్ నాట్యకళలో అర్థశతాబ్దిపరిణామం"

"డాన్సు జాబిలీ" అనే అమెరికను నర్తకుల బృందం . నవంబరులో మద్రాసు - రాజా అన్నామలై మందిరంలో ప్రదర్శనలిస్తారు. ప్రఖ్యాత అమెరికన్ టెలివిజను నటుడు రాడ్ అలెగ్జాండరు ఈ బృందానికి అధ్వర్యం వహిస్తున్నాడు.

రెండు గంటల పాటు, ఈ శతాబ్దారంభంనుంచి ఇంతవరకు అమెరికను నాట్యరంగంలో వచ్చిన పరిణామాలను వీరు తమ ప్రదర్శనాలలో చూపుతారు.

ఈ బృందం పేరెన్నిక గన్న నర్తకీ నర్తకులు 16 మందితో వుంది. ప్రఖ్యాతబాలే నర్తకీ మణులు గెమ్‌జే డిలాప్, కార్మెను గ్యూటెజెజ్, నర్తకుడు క్రిస్టాఫరు వంటివారు ఉన్నారు. ఈ బృందం కేక్‌వాక్ (నీగ్రోల నృత్యాలలో ఒక రకం), స్ట్రిటు నృత్యాలు చేస్తారు. ఇంకా వాడివిల్ నృత్యాలు, సంగీతరూపకాలు కూడా ప్రదర్శిస్తారు. అధునాతన జాజ్ రీతులు, నేటి అమెరికను సినిమాలలో కన పడే నృత్యాలు బ్రాడ్వే నాటకాలలో చూచే నాట్యాలు కూడా ఈ నర్తకీ నర్తకులు చూపుతారు. చివరి అంశంగా నేటి కాలపు షాగ్, స్ట్రోల్, లిండీహాప్ నృత్యాలు చేస్తారు.

"డాన్సు జాబిలీ" బృందం అమెరికను ప్రెసిడెంటు అంర్జాతీయ సాంస్కృతిక సమర్పణల కార్యక్రమం క్రింద 19 వారాల పాటు ఆసియాలలో 12 దేశాలలో ఇట్లా నృత్యం ప్రదర్శనాలు ఇవ్వటానికి బయలు దేరింది. అమెరికను నేషనల్ థియేటరు అకాడమీ దీనిని నిర్వహిస్తున్నది.

రాడ్ అలెగ్జాండరును తన కంపెనీని ఈ దేశాలకు తీసుకు వెళ్ళవలసిందిగా ఈ అకాడమీ కోరినప్పుడు తాను ఆ ఆహ్వానాన్ని రెండు ఉద్దేశాలతో ఆమోదించానన్నాడు. అమెరికను జనరంజక నృత్యాలు ఎట్లా ఉందేది ఈ ప్రాచ్య ప్రజలకు చూపటం, ఈ దేశాల నృత్య తులను గురించి తాను ఇంకా బాగా నేర్చుకోవటం తన యోచన లన్నాడు.

చిన్ననాడు జాక్ కోల్ వద్ద అమెరికను నృత్యంతో పాటు హైందవ నాట్య రీతులను గురించి నేర్చుకొంటున్న నాటి నుంచీ రాడ్ అలెగ్జాండరుకి ప్రాచ్య నృత్య కళ పట్ల ఆసక్తి ఉన్నది. అందువల్ల భారత దేశంలో ప్రసిద్ధ నర్తకులను కలుసుకొని వారితో నృత్య కళను గురించి పరస్పరం తెలుసుకోవాలని రాడ్ అలెగ్జాండరు ఉవ్విళ్ళూరుతున్నాడు. ఈ కార్యక్రమంలో ఈ బృందం బెంగుళూరు, మద్రాసు, హైదరాబాదు, కలకత్తా, బొంబాయి, బరోడా, లక్నో, ఢిల్లీ నగరాలు చూస్తుంది.

ప్రముఖ టెలివిజను నర్తకులలో ఒకడుగా పేరు గాంచిన రాడ్ అలెగ్జాండరు "ఎడు నలిపనుషో" "యువరుషో ఆఫ్ షోస్", "ది స్టీవ్ ఎలెన్‌షో", "ఆర్థరు మురెపార్టీ" వంటి ముఖ్య కార్యక్రమాలల్లో పాల్గొన్నాడు

ఈయన ప్రతిభ ఒక్క టెలివిజను కార్యక్రమాలకే పరిమితం కాలేదు. బ్రాడ్వే ధియేటరు, ప్రముఖ రాత్రి క్లబ్బులందు నృత్యాలు చేశాడు. చాల చలన చిత్రాలకు నృత్య దర్శకత్వం నెరిపాడు "కరోసెల్, "ది బెస్ట్ తింగ్స్ ఇను లైఫ్ ఆర్ ఫ్రీ" వంటి చిత్రాలు ఈ సందర్భం పేర్కొనవచ్చును. అయితే ఏడు సంవత్సరాల క్రింతట టెలివిజను ద్వారానే ఆయనను దేశం యావత్తు గుర్తించింది, అప్పనుంచి ఈ రంగంలోనే ఉన్నాడు.

రాడు అలెగ్జాండరు స్వయం సృష్టి "డాన్సు జూబిలీ" బృందం. ఈ బృందం తొలి ప్రదర్శనంఇచ్చి నప్పుడు ప్రేక్షకుల మన్ననలు విశేషంగాచూర గొన్నది.

"డాన్సు జూబిలీ తొలి ప్రదర్శనం నృత్య ప్రియులను ముగ్ధుల్ని చేసింది" అని 'మిల్వాకీ జర్నల్' పత్రిక ప్రశంసించింది.

ఈ బృందం పర్యటన ఫలితంగా ఆసియా ప్రజలు అమెరికను జనరంజక నృత్యాలు చూచే, సుగమ సంగీతం, జానపదగేయాలాపన వినే అవకాశం లభిస్తున్నది.



## పాల పంపకము

ఆం. మ. సభ ఆవరణలో బీద బాల- బాలికలకు, గర్భిణీ స్త్రీలకు, వృద్ధులకు ప్రతీ రోజు ఉదయము 7-గంటలకు పాల పంపకము జరుగుచూనే యున్నది.

1959 మార్చి నుండి- అక్టోబరు నెలాఖరు వరకు పాలు ఉచితముగా తీసుకున్న వారి సంఖ్య : మార్చిలో 4319 ఏప్రిల్ " 2685 మే " 2665 జూను " 2757 జూలై " 8610 అగస్టు " 4922 సెప్టెంబరు "6839 అక్టోబరు " 8695 మొత్తం. 41.192 మంది.

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

**Statistics for the month of September, '59.**

**OUT-PATIENT REGISTER**

| | |
|---|---|
| No. of Surgical cases treated | 61 |
| " " Medical " " | 1,006 |
| " " Gyneac " " | 158 |
| " " Ante-natal " " | 320 |
| " " Post-natal " " | 61 |
| " " Dental " " | 10 |
| " " E.E.N.T. " " | 77 |
| Total Number of New Patients | 1,693 |
| Total Number of Old Patients | 2,447 |
| Grand total | 4,140 |

**ADMISSION REGISTER**

| | |
|---|---|
| No. of Normal deliveries | 156 |
| " " Abnormal deliveries (Forceps 8) M. R. Placenta | 10 |
| " " Antenatal cases with False Pains | 19 |
| " " Antenatal cases with Texeamia | 6 |
| " " Post-natal cases | 4 |
| " " Gyneac " | 31 |
| " " Medical " | 89 |
| " " Surgical | 1 |
| " " Babies admitted as Lodgers | 159 |
| Grand total | 475 |

(Sd.) Dr. K R. AMBUJA, *R. M. O*

(Sd.) Dr M. PAVANA BAI, *Medical Superintendent.*

(Sd.) Smt. V. LAKSHMI PARVATHI, *Secretary.*

Printed & Published by Smt. T G. Hymavathy, at the Andhra Mahila Press Mylapore, Madras 4.
Editor: Mrs Ramalakshmi Arudra